## ENGLISH - TELUGU

# SCIENTIFIC GLOSSARY

# శాస్త్రపరిభాష

EDITED BY

D. V. SIVA RAO, B. A., B. L.

CONTAINS

*Telugu Synonyms of English Terms*

*RELATING TO*

*Mathematics, Physics & Chemistry; Biology, Botany, Physiology, Zoology & Anatomy, Astronomy, Physiography & Geography; Hygiene and Medicine, Logic and Philosophy Etc.*

*and*

*Comparative Tables of Weights & Measures.*

---

BEZWADA

1934

రూ

D Venkataratnam
Assistant Translator
Legislative Assembly
Hyderabad.

# ENGLISH - TELUGU

# DICTIONARY

## TECHNICAL & SCIENTIFIC

( IN TWO PARTS )

EDITED BY

D. V. SIVA RAO, B. A., B. L.

**Part I — The Dictionary of Technical Terms**

CONTAINS

Telugu Synonyms, Meanings, Explanations and Definitions of English words and Phrases, relating to Politics, Economics & Law; Public Finance, Stock-Exchange, Business and Co-operation

WITH

A Glossary of Hindustani Terms

AND

**Part II — The Scientific Glossary**

CONTAINS

Telugu Synonyms of English words & phrases relating to Mathematics, Physics & Chemistry; Biology, Botany, Physiology, Zoology & Anatomy; Astronomy, Physiography and Geography; Hygiene & Medicine; Logic and Philosophy Etc.

WITH

Comparative tables of Weights & Measures.





[ PRICE Rs. 2-8-0

# పీఠిక

అనుక్షణము నభివృద్ధి గాంచుచున్న ప్రపంచవిజ్ఞానమునకు, శాస్త్రపరిశోధనలకు, రాజకీయార్థిక ప్రజాజీవనమునకు వ్యవహారములకు సంబంధించిన నూతనభావములనుగూర్చి మాటలాడుకొనుటకు, వ్రాయుటకు నేదోయొక పరిభాషయుండుట యావశ్యకమని అందరంగీకరింతురు. అయితే "ఆ పరిభాష కేవలము సంస్కృతాంధ్రపదభూయిష్ఠముగ నుండవలెనా లేక అన్యభాషీయ పదములు, మిశ్రసమాసములు కలిగినదిగకూడ నుండవచ్చునా?" అను విషయమున మాత్రము పండితులయం దభిప్రాయభేదము కలదు. క్రొత్త భావమునుగూర్చి క్రొత్తపదమును నిర్మించుటలో సాధ్యమైనంతవరకు దేశీయపదములనే ఉపయోగించుట యుక్తముగాని దేశములోని జనసామాన్యములో వాడుకలోనికి వచ్చి, నూటికి తొంబదిమందికి అర్థమగుచున్న వాడుక పదము దేశీయమైనను అన్యదేశీయమైనను, సాధువైనను అసాధువైనను, భాషలోనుండి తొలగించవలసినదనిమాత్రము పలుకుట కెవ్వ రంగీకరింపరు. మహామ్మదీయ ప్రభువుల పాలనకాలమున పార్సీ ఉర్దూభాషలనుండియు నేడు ఇంగ్లీషులోనుండియు తెనుగున వాడుకలోనికివచ్చిన వివిధములగు హిందూస్తానీ ఇంగ్లీషుపదములగు తాసిల్దారు, రోజు, అవర్జా, కోర్టు, మోటారు, రైలు, జైలు మున్నగు పదము లిట్టివే. ఈపదములకు సంస్కృత పర్యాయపదములున్ననుగూడ అవి యింత జనాదరణను పొందజాలవు. అట్టిపదము లింగ్లీషులోనుండి సంతతవృష్టిగా వచ్చి మన తెనుగులో నింకను జేరుచున్నవి.

భాషలోనికివచ్చిన పదములను విమర్శించి సంస్కరించి నిఘంటువులందుచేర్చి వానికి స్థిరరూపము నిచ్చు పండిత పరిషత్తులును తుద కాపదముల కర్థములు దెలుపు నిఘంటువులైనను లేనందువలన అనుక్షణమును వృద్ధి జెందుచున్న క్రొత్తపదములకు స్థిరరూపములేక ఎవరికి తోచినట్లువా రుపయోగించుట తటస్థించుచున్నది. అందువలన నొకేభావమునకు పలువురు పలువిధములగుపదము లుపయోగించుటయు తటస్థించుచున్నది. మఱియు పదములు వృద్ధియైనను వాని అర్థములందు సూక్ష్మభేదములు స్థిరపడి భాషకుపకరించుటకును నవకాశము లేకున్నది. వాడుకలోనున్న పదములకు అర్థములు సరిగా

తెలియునందున విద్యార్థులు సామాన్యజనులు వానిని విపరీతార్థములందు వాడుటయుకూడ తటస్థించుచున్నది.

వాడుకలోనున్న పదములు సంస్కరింపబడి సరియగు సాంకేతిక పదజాలము నిర్మింపబడువరకు నిఘంటువులలో నుదాహరింపమని భీష్మించుకొని కూర్చుండుట 'పెళ్లైనగాని పిచ్చికుదురదు, పిచ్చికుదిరినగాని పెండ్లికా' దను వితండవాదమువలె పరిణమించును. తప్పులో ఒప్పులో కొన్ని వాడుక పదములు, వాని అర్థములు, నొక్కచోట నున్నగదా అవి సాధువులో అసాధువులో యను తలంపును, ఇంపులో కటువులో అనుయోజనయు, కలిగి సంస్కరణాభిలాష కలుగుట? ఈ తమ ఆంగ్ల నిఘంటువులందు దేశ్యములు, విశ్రుతులు, మాత్రమేగాక విపరీత సమాసపదములు, పామరజను లుపయోగించు వర్గక్రమ విహీనపదములు, కూడ చేర్చబడుట కానవచ్చుచున్నవి. ఆ పద్ధతి మనకు లేకపోవుట సంతాపకరము.

సాంకేతికపదములనునవి యావత్ప్రపంచమునకును సంబంధించిన విజ్ఞానమును గూర్చిన క్రొత్తభావములను సూచించునవి గనుక వీలైనచో యావద్భారతదేశమున కొకే పారిభాషికపదము లుపయోగింపబడుచో దేశమునకెంతో మేలు కలుగగలదనుట నిశ్చయము. ఈ సంగతిని గమనించియే హిందీమహారాష్ట్ర విద్వాంసులు ఆయాభాషలందలి సాంకేతికపదములు సాధ్యమగునంతవరకు యావద్భారతదేశమున కుపయోగించులాగున సంస్కృత పదములతోనే నిర్మించిరి. అందువలననే ఆభాషావిదులు ప్రకటించిన హిందీ సయింటిఫిక్ గ్లాసరీ, ట్వెంటియత్ సెంచరీ ఇంగ్లీషు మరాటీ నిఘంటువులు ఆభాషలవారికేగాక భారతదేశములోని తక్కిన అన్నిభాషలవారికిని అమితోపయోగకరములుగ నున్నవి. కీర్తిశేషులగు కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు విజ్ఞానచంద్రికామండలిద్వారా ప్రకటించిన శాస్త్రగ్రంథములందును విజ్ఞానసర్వస్వమందును సమకూర్చిన శాస్త్రవిజ్ఞాన సాంకేతిక పదజాలము కూడ ఈనిఘంటువుల సాహాయ్యముననే నిర్మింపబడియున్నది. ఈపదజాలము సర్వజనాదరణీయమై మెప్పువడసి అనేక గ్రంథకర్తలచేత నుపయోగింపబడుచున్నది. నేటి పాఠ్యగ్రంథములందుకూడ చాలవరకీపదములే ఉపయోగములో నున్నవి. తుదకు సాంకేతికపదములను పరిష్కరించుటకు మద్రాసు

ప్రభుత్వమువా రేర్పరచిన ఉపసంఘమువారు ఇటీవల ప్రకటించిన "Telugu Equivalents of English Terms" అను చిన్నపొత్తములలో కూడ పై పరిభాషనే స్వీకరించినారు. అందువలన నీ పదజాలమునకు స్థిరత్వ మేర్పడినదని చెప్పవచ్చును.

క్రొత్తపారిభాషిక పదములమాట యటులుండనిచ్చి పైనచెప్పబడిన పదజాలమైనను సర్వజనోపయోగకరముగ నుండునట్లు ఒక్కచోట చేర్చి ప్రకటించిన నిఘంటువు లేనందునను, ఉన్న నిఘంటువులలో పై పదము లన్నియు చేర్చబడియుండనందునను, ప్రభుత్వమువా రింతవరకు ప్రకటించిన పదములపట్టిక లందుకూడ సమగ్రముగు వైజ్ఞానికశబ్దజాలము లేనందునను అపట్టికలుకూడ వేరువేరు పొత్తములుగా ప్రకటింపబడినందునను పారిభాషిక పదనిఘంటువులేని కొరత నేటికిని దీరలేదు. పైపదజాలమెల్ల నొక్కచోటజేర్చి ప్రకటించుటయు, దానిలో చేరనట్టియు అధునిక ప్రపంచ విజ్ఞానమునకు శాస్త్రపరిశోధనలకు రాజకీయార్థిక ప్రజాజీవనమునకు సంబంధించిన నూతనభావములను తెలుపునట్టియు ఇంగ్లీషు సాంకేతిక పదములకు తెలుగున పర్యాయపదములుగా ఆంధ్రదేశమున నెక్కడనో యొక్కచోట ఎవ్వరివలననో యొకరివలన నుపయోగింపబడి గ్రంథస్థములై వాడుకలోనికి వచ్చినట్టి ఇంగ్లీషు హిందీ తెలుగు సంస్కృతపదములును, గురికి బారెడు హెచ్చుతగ్గుగా క్రొత్తభావములకు సాంకేతికములుగా సామాన్యజనులసంభాషణలందు విరూపము జెంది ఉపయోగింపబడు అన్యభాషీయ పదములును, ఇట్టివికూడ లేనప్పుడు మనభాషాసంప్రదాయమునకు దగ్గర బంధువులగు హిందీకోవలో చేరిన భాషలలో నీక్రొత్తభావములకు పర్యాయపదములుగానుపయోగింపబడుచున్న సాంకేతిక పదములను నొక్కచోట జేర్చి ప్రకటించుటయే ఈ చిన్న నిఘంటువుయొక్క ప్రధానోద్దేశ్యము.

ఈ చిన్న నిఘంటువు నిరూపమున బ్రకటింతునని నే నెన్నడును తలంపలేదు. పారిభాషిక నిఘంటువును రచించు నుద్దేశ్యముతో దీనిని నేను రచియింపనులేదు; బ్రకటింపనులేదు. అట్టి నిఘంటురచనమున కిది తోడ్పడినచో ధన్యుడనే. రాజకీయార్థిక విజ్ఞానమునుగూర్చి నేను కొంతకృషిసలిపి తెనుగున కొన్ని వ్యాసములు పుస్తకములు వ్రాసిన సందర్భములో నేను సముకూర్చి

యుపయోగించిన పారిభాషిక పదములే యీ నిఘంటురచనమునకు మూల కారణములు. ఆపదముల నన్నిటి నొక్కచోఁజేర్చి ప్రకటించినచో అవి విద్యాధికులచే విమర్శింపబడి సంస్కరింపబడుటకు కవకాశము కలుగుననియు, పారిభాషికనిఘంటువు లేనందువలన నదియొక చిన్న నిఘంటువుగా కొందరి కైన నుపయోగింపక పోవదనియు నా మిత్రులు ప్రోత్సహింపగా నేను సమకూర్చిన రాజకీయ, ఆర్థిక, న్యాయశాస్త్ర వ్యవహారములకు సంబంధించిన పదములకు అర్థములు నిర్వచనములును వ్రాసి 'వ్యవహారకోశము' అను పేరిట కొంతకాలముక్రిందట ప్రచురించితిని. నాయందలి వాత్సల్యమువలననో, అది పారిభాషికపదములను గూర్చిన ప్రథమగ్రంథ మగుటనో లేక నిజముగా దానియందు గుణలేశముండుటవలననో ఆంధ్రాంగ్లపత్రికలును, విద్యాధికులును దాని నాదరించి సదభిప్రాయము లొసగుట తటస్థించినది. అందువలననే ఆ పదములతో పాటు నేను సేకరించిన ఇతర శాస్త్రవిజ్ఞానమునకు సంబంధించిన శాస్త్రపారిభాషికపదములనుగూడ జేర్చి యీ నిఘంటువు నీరూపమున ప్రకటింప సాహసించుచున్నాను.

ఈ సాంకేతికపదజాలమే సర్వోత్కృష్టమును నిర్దుష్టమునని గాని, ఈ నిఘంటువే పరమప్రమాణముగ గైకొనబడవలెననికాని పలుకునంతటి మూర్ఖుడను కానుగాని తక్కిన భాషలందువలెనే మనకును పరిపూర్ణములును నిర్దుష్టములును ప్రమాణభూతములు నగు ఉత్తమసాంకేతిక ద్వైభాషిక నిఘంటువులుగాని విజ్ఞానకోశములుగాని లేనందువలనను, ఉన్న నిఘంటువులందైనను ఆధునికవిజ్ఞానమునకు శాస్త్రపరిశోధనలకు సంబంధించిన పదములు లేనందునను ఏదో యొకదారి త్రొక్కనగాని పదజాలమునకు వాని అర్థములకు ఉపయోగమునకు నొకస్థిరత్వ మేర్పడదనియు, వాని నిర్మాణపు టౌచితి సౌష్ఠవములను గూర్చిన తలంపులును సంస్కారాభిలాషయు కలుగుటకే అవకాశములు కలుగవనియు, అంతవరకు ప్రజోపయోగముకొరకు నిఘంటువే కరవగుననియు తలచి, నిఘంటునిర్మాణమునకు వలసిన అంగబలము, అర్థబలము, విద్యాబలముకూడ కలిగియున్న విద్యాధికుల విమర్శనముకొరకు పారిభాషికపదజాలముయొక్క చిత్తుప్రతి నొకదానిని తయారుచేయుట యావశ్యకమనికూడ తలచి, ఈనిఘంటువు నీ రూపమున

బ్రకటింప సాహసించితిని. ఈపదజాలమును బరిశీలించి విమర్శించి సంస్కరించుటయు, ఇంకను చేర్చవలసిన క్రొత్తపరిభాషను జేర్చియు ఆంధ్రమున గూడ తక్కిన గొప్పభాషలందువలెనే ఒక ప్రమాణభూతమగు ఉత్కృష్ట పారిభాషిక నిఘంటువును నిర్మించవలసిన బాధ్యత, పండితపరిషత్తువారిదే.

భాషాభిమాను లెవ్వరైనను ఈనిఘంటువులోనిపదములను బరిశీలించి విమర్శించి వానిని సంస్కరించు విషయమున నేమైన సూచనల జేసినచో వాని నెల్ల కృతజ్ఞతాపూర్వకముగ స్వీకరించి శిరసావహించెదను. ఈనిఘంటు రచనమున నాకు తోడ్పడిన సంస్కృతాంధ్రాంగ్లగ్రంథములయొక్కయు, పత్రికలయొక్కయు పట్టిక నింకొకచోట నుదాహరించుచున్నాను. ఈ నిఘం టురచనలో నాకమితముగా తోడ్పడిన ట్వంటియత్ సెంచరీ ఇంగ్లీషు మరాటీ నిఘంటువును, హిందీ సైంటిఫిక్ గ్లాసరీ (క్రొత్తముద్రణమును) మరల నిక్కడ కృతజ్ఞతా పూర్వకముగా స్మరించుచున్నాను. ఆయా గ్రంథకర్తలకు,ప్రకాశ కులకు నేను కృతజ్ఞుడను. ఈ నిఘంటురచనలో నాకు కీర్తిశేషులగు కొమ ర్రాజు లక్ష్మణరావుపంతులుగారి అమూల్య గ్రంథసముదాయము మిక్కిలి తోడ్పడినది. ఆ పుస్తకములు చదువుకొనుటకు నందులో నాకు వలసిన ప్రధాన గ్రంథములను నాకడ చాలకాలమువరకు నుంచుకొనుటకు నవకాశ మిచ్చి నా కమిత సాహాయ్యము జేసిన మిత్రులు ఉభయభాషాప్రవీణ కాటూరి వీరభద్రేశ్వరరావు, బి. ఏ., యల్. టి., గారి యుపకారము మఱువజాలను. ద్వైభాషిక నిఘంటు ముద్రణమునందు కలుగు శ్రమలకెల్ల నోర్చి పుస్తక మును జాగ్రత్తగా నచ్చొత్తించిన ఆంధ్రగ్రంథాలయ ముద్రాశాలాధికారు లకును నందు ముఖ్యముగా అచ్చుచిత్తుల దిద్దుటలో నా కమిత సాహాయ్య మొనర్చిన శ్రీయుత కుందా నరసింహమూర్తిగారికిని కృతజ్ఞుడను.

భావసం. — దీపావళి,
6-11-34.

— దిగవల్లి వేంకటశివరావు.

## ఈ నిఘంటురచనకు ముఖ్యముగా తోడ్పడిన గ్రంథములు, పత్రికలు.



1. The Twentieth Century English Marathi Dictionary (Literary, Scientific and Technical) by R. B. Ranade, B.A.
2. The Hindi Scientific Glossary, (The Nagari Pracharini Sabha, Benares)
3. English Sanskrit Dictionary —V. S. Apte, M.A.
4. Wilson's Glossary.
5. English Telugu Dictionary —C. P. Brown
6. English Telugu Dictionary, —Sankara Narayana.
7. Kanarese English Dictionary —Rev. F. Kittel
8. Canarese English Dictionary —Rev. W. Reeve
9. Manual of the Administration of the Madras Presidency Vol III—Maclene.
10. Glossary of Law Terms —Tamil, Telugu, Canarese and Malayalam. (Madras Govt)
11. Telugu Equivalents of English Terms Madras Govt.
12. The Encyclopaedia Britannica —XIVth edition
13. Gresham's New Cyclopaedia
14. Indian Plants and Drugs—Nadkarni
15. Translation tests (old series) —Madras Govt.
16. Hindu Adminisirative Institutions —Dikshitar (1929)
17. Ancient Hindu Juris prudence —Priyanath Sen
18. Artha Sastra of Kautilya —Shama Sastri.

| | |
|---|---|
| అమరకోశము | మనుస్మృతి |
| హిందీవైజ్ఞానికకోశము | లక్ష్మీనారాయణీయము |
| శబ్దరత్నాకరము | వస్తుగుణమహోదధి |
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము | చరకసంహిత |
| శబ్దార్థచంద్రిక | ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక |
| గౌతమధర్మసూత్రములు | వాత్స్యాయనుని కామసూత్రములు |

విజ్ఞానచంద్రికా గ్రంథమాల ప్రచురణములు

శ్రీ వీరేశలింగంపంతులుగారి రచనలు.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారి రచనలు

శ్రీ వావిలికొలను సుబ్బారావుపంతులుగారి రచనలు

శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి రచనలు

శ్రీ చేకుమళ్ళ రాజగోపాలరావుపంతులుగారి రచనలు

శ్రీ నూట్నూరి కృష్ణారావుపంతులుగారి వ్యాసములు

ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలు.

కృష్ణాపత్రిక; భారతి; శారద.

---

## సాంకేతికాక్షరముల వివరము

| | |
|---|---|
| (ప్రా) = ప్రాచీనపరిభాష | (గణి) = గణిత శాస్త్రము |
| (హిం) = హిందీ | (జీవ) = జీవశాస్త్రము |
| (ర) = రసాయన శాస్త్రము | (జ్యోతి) = జ్యోతిశ్శాస్త్రము |
| (వ్యాక) = వ్యాకరణ శాస్త్రము | (ఖగో) = ఖగోళ శాస్త్రము |
| (తర్క) = తర్క శాస్త్రము | (శరీ) = శరీర శాస్త్రము |

# OPINIONS

SIR V. RAMESAM.

"GOPAL VIHAR",
Elliot's Road, Mylapore,
30—9—34

"TheEnglish- Telugu Dictionary of Technical terms is a very useful publication It enables one to write books on a Technical subject in the Telugu language without using foreign terms. At present, this is difficult for want of a refined collection of technical terms. The work is somewhat like that performed by the Nagari Pracharini Sabha of North India. I am informed that he proposes to add a supplement for purely scientific terms though some are to be found already. Such a supplement will enhance its usefulness still further."

(Sd ) V. RAMESAM.

"Is sure to prove indispensable for purposes of reference in all Public Libraries and in Government and other Offices where translation from English to Telugu and *vice versa* has to be done. All honour is due to pioneers like Mr. Siva Rao."

— THE HINDU, 19—6—34

"The author has provided the basis for a committee to work on, and as such deserves the congratulations and best wishes of scholars all over Andhra Desa"

REV. CANON, D. ANANTHAM.

"I have found the Telugu equivalents very apt. I can very well recommend it to any person who wants to translate difficult English words and phrases"

V. PURNAIYA ESQ, B.A.,B.L.
Retired District Judge.

"The translation is meticulously accurate."

R. VEMBU IYER Esq, B. A., B. L.
Subordinate and Asst. Sessions Judge.

# A Few of the Prominent Patrons

The Honourable Justice, Sir Vepa Ramesam Pantulu.
The Hon'ble Sir K. V. Reddi Garu, B. A., B. L.,
Sir Alladi Krishnaswami Garu, Advocate General.
D. Appa Rao Esq., Bar-at-Law, Master, High Court, Madras.
J. K. Lancashire Esq., I. C. S., District Judge, Nellore.
Vepa Purnaiya Pantulu Esq., B. A., B. L, Retd. Dist. Judge.
N. Balaramamurti Pantulu Esq, B. A., B. L., Sub-Judge.
R. Vembu Iyer Esq., B.A.,B.L., Asst. Sessions and Sub Judge,
Mahabub Khan Esq., Treasury Deputy Collector.
English Kannada Dictionary Office, (Mysore Govt.) Bangalore
B. Joogappa Esq., M. A., Sub-Magistrate, Harpanahalli.
N. S. Narasimhachari Esq, B. A., B. L., Sub Judge.
M. Balarama Reddi Esq., B. A., B. L., Dt. Munsiff.
D. Krishna Murti Esq., B. A., B. L., Dt. Munsiff.
K. R. Krishnaiah Chetti Esq., B. A., B. L., Dt. Munsiff.
E. Krishna Murti Esq B. A., B. L., Dt. Munsiff.
K. Subba Rao Esq., B. A., B. L., Dt Munsiff.
Desoddharaka K. Nageswara Rao Pantulu Esq.,
The Maharaja of Venkatagiri.
A. Kaleswara Rao Pantulu Esq., B. A., B. L., EX-MLC.
Rao Bahadur N. Ranganatha Acharya Garu, B. A., B. L.,
Retired Deputy Registrar of Co-operative Societies.
The Rev. Canon D. Anantham.
P. H. Gupta Esq. Bar-at-law, Secretary,
Oriental Govt. Security Life Insurance Co., Vizagapatam.
The Zamindar of Jayanthipuram.
The Benares Hindu University Library.
The National Theosophical College, Madanapalli.
Prof. N. G. Ranga, B. Litt (OXON).
Dr. D. S. Ramachandra Rao, M. A., M. D., Bezwada.
Pandit, Marepalli Ramachandra Sastri garu, Vizagapatam.
The Kistna District Co-operative Federation, Ltd.

# The Scientific Glossary.

# శాస్త్ర పరిభాష.

## A

Abcess=విద్రధి; కురుపు, వ్రణము.

Abdomen=పొత్తికడుపు.

Abdominal cavity=ఉదరగుహ; గర్భకుహరము.

Aberration=అస్పష్టత; (ప్రకాశ) భ్రంశము; చంచలబుద్ధి.

Abortion=గర్భస్రావము.

Abrasion=కొట్టుకొనిపోవుట; (చర్మము) గీసుకొనిపోవుట.

Abscissa=ప్రథమభుజ; కోటిభుజ; కోభుజ; ప్రథమసంబంధము; మట్టపు భుజము; నిరూపకము.

Absolute expansion=నిజవ్యాకోచము.

Absolute scale=నిస్సర; నిరాధారమానము; తారతమ్యరహితమానము.

Absolute terms=అసంబంధిక పదములు.

Absolute temperature=తారతమ్యరహితోష్ణత.

Absolute zero=నిరుష్ణస్థితి.

Absolutism=అనన్యసంబంధితము; కేవలత; విముక్తి.

Absorption=పీల్చుట; శోషణము.

Acceleration=వేగాధిక్యత.

Accelerated motion=వర్ధమానగతి.

Accelerated velocity=వర్ధమానవేగము.

Accentus=స్వరదోషము.

Accidens=ఘటనాలక్షణము.

Accident=వికారము.

,, Separable=విభాజ్యవికారము.

Accident Inseparable=అవిభాజ్యవికారము.

Accidentalism=అకారణవాదము. (తర్క-)

Acclimitization-అన్యదేశస్థితిగతుల కలవాటుపడుట; అన్యదేశ శీతోష్ణమున కలవాటుచెందుట.

Accomodation =సర్దుబాటు.

Accoustics=ధ్వనిశాస్త్రము.

Accretion=పటలవృద్ధి, వృద్ధి.

Accumulator=(అక్యూమిలేటరు) సంగ్రహణయంత్రము.

Accurate=సరియైన.

Acetic acid=అశితామ్లము, సౌరికామ్లము.

Achlamydeous=నగ్నపుష్పము.

Achromatic lens=నిర్దుష్టముగు కటకము.

Achromatin=అవర్ణేషి; రంగుకెనట్టిది.

Acid=పులుసు; కాడి; ఆమ్లము.

Acid Boric=టంకామ్లము.

Acid Commercial=కల్తీద్రావకము.

Acid Hydrochloric=హైడ్రోక్లోరిక్ ఆసిడ్, ఉదజహారికామ్లము.

Acid Hydriodic=హైడ్రియాడిక్ ఆసిడ్.

Acid Lime=నిమ్మ.

Acid Nitric=నత్రికామ్లము; పెట్లుప్పుద్రావకము.

Acid Oxalic=ఆగ్జాలిక్ ఆసిడ్.

Acid Pure=నిర్దుష్టామ్లము.

Acid Sulphuric=గంధికామ్లము, గంధకధృతి.

Acid Sulphurus=గంధకామ్లము; గంధకద్రావకము.

Acid Tartaric=తింత్రిణికామ్లము; చింతపండు ద్రావకము.

Acidity=అమ్లపిత్తము; పులితేన్పులు.

Acidulated=అమ్లకృతమైన; పులిసిన.

Acne=మొటిమలు.

Aconite=నాభి; వసనాభి.

Acre=ఎకరము.

Action=కర్మ; క్రియ.

Acuminate=వాలముగల.

Acuteness=తీవ్రత; తీక్ష్ణత.

Acute angle=లఘుకోణము.

Adams apple=కంఠమణి; కంఠకాయ.

Add=కూడు; సంకలనముచేయు.

Addend (addendum)=అనుబంధము; కూడవలసినసంఖ్య (ధనము).

Addition=కూడిక; సంకలనము.

Adhesion=ఆశ్లేష; అంటుకొనుట.

Adhesive force=స్నేహశక్తి; అంటుకొనుగుణము.

Ad-infinitum=అపరిమితము; అపారము; అనంతము.

Adipose tissue=క్రొవ్వు.

Adjacent=చెంతనుండు; చేరియుండు; అనుకొనియుండు; ప్రక్కనున్న; సంలగ్న; ఆసన్న; సన్నిధి; నికటవర్తి.

Adventitious buds=అంటుమొగ్గలు.

Adventitious roots=అబ్బురపువేళ్లు; అంటువేళ్లు; ఊడలు.

Adze=బాడిస; బాడిద; వడ్రపుపనిముట్టు.

Acquivocatio=వాక్ఛలము. (తర్క)

Aerated waters=వాయుమిళితాంబువులు; సోడాపానీయములు.

Aerial Hyphae=ఊర్ధ్వతంతువులు.

Aerial Roots=గాలివేళ్లు; ఊడలు.

Aeriation=వాయుపరిచారము.

Aetiology=వ్యాధి నిదానము; రోగకారణము.

Afferent=అంతర్వాహిని; అంతర్ముఖి.

Afferent Nerves=స్పర్శనాడులు.

Affinity=అనురాగము; స్వాకర్షణము; రాసాయని కాకర్షణము.

Affirmation=భావము; భావకథనము, స్థిరపరచుట.

Affirmative proposition=భావవాక్యము.

Agaricus=కుక్కగొడుగు.

Agave=కిత్తనార.

Agency=కారకత్వము; కర్తృత్వము; కారణము.

Agent=కార్యసాధని; కర్త; కారకుడు.

Aggregate=మొరశి; మొత్తము; కూడినది.

Aggregation=సముదాయము; కూడదీయుట.

Air=గాలి; వాయువు.

Air, Complimental=సంపూరక వాయువు; ఊపిరితిత్తులలోని గాలి; బయటనుండి లోపలికి పీల్చుకొనుగాలి.

Air, Residual=అవశిష్టవాయువు; ఊపిరి బయటికి విడిచినతరువాత లోపల మిగిలినగాలి

Air, Supplemental=పరిశిష్టవాయువు; బయటికి విడువబడగల గాలి.

Air breathers=వాయుశ్వాసములగు ప్రాణులు.

Air cells=వాయుగోళములు.

Air pump=వాయువ్యాకర్షణయంత్రము; వాతరేచకము; దేనిలోనుండిగాని గాలిని పీల్చివేసి యుత్తదిగాచేయుటకుగాని హెచ్చుగాలిని నింపుటకు గాని ఉపయోగించుయంత్రము.

Alabaster=చంద్రకాంతశిల; చలువరాయి.

Albumen=శ్వేతధాతువు; అల్బూమిను; కోడిగుడ్డులోని తెల్లనిభాగము.

Albuminous=అంకురచ్ఛదసాయుత.

Albuminuria=లాలామేహము.

Alcohol=మద్యసారము.

Alcoholism=మదాత్యయము, (మద్యపాన) మాంద్యరోగము.

Alexandrian laurel=పొన్న (చెట్టు).

Algae=నీటి పాచి.

Algebra=బీజగణితము, అక్షరగణితము.

Alimentary canal=అన్న వాహిక; మహాస్రోత, జీర్ణకోశము.

Aliquot parts=ఏకాంశభాగములు; నిశ్శేషభాగములు; సమభాగములు; సరిపాళ్ళు.

Alkali=క్షారము; కారము.

Alkali potash=పొటాసియక్షారము.

Alkali soda=సోడియక్షారము.

Alligation=మిశ్రమగణితము; సువర్ణగణితము; రసములచేర్పు, మిశ్రమ నియమము;

Allopathy=ప్రతిక్రియచికిత్స; రోగగుణములనుబట్టి చికిత్సచేయువైద్యము, (పాశ్చాత్యవైద్యము)

Allotrope=రూపాంతరము. Allotropy=బహురూపత.

Alloy=సమ్మేళనము; ధాతు సమ్మేళనము; మిశ్రలోహము.

**Alluvial Soil**=ఒండలినేల, పులినమయభూమి.

**Almond**=బాదము; కాయ బాదముచెట్టు; గొంతుకలోని గవదకాయ.

**Aloe**=కలబంద. **Aloes Wood**=ముసాంబరము; అగరు.

**Alteratives**=రూపాంతర కారకములు; శారీరక (రక్త) స్థితిని మార్చునవి.

**Alternate**=పక్షాంతర; ఏకాంతర; ఒకటివిడిచి ఒకటిగానున్న; వికల్పమైన.

**Alternative**=వికల్పము; రెంటిలో నొకదాని నెంచుకొనుట.

**Altitude**=ఉన్నతాంశము; లంబము; ఔన్నత్యము: ఉచ్చము; పొడవు; ఎత్తు.

**Aluminium**=అల్యూమినియము; స్ఫటము.

**Aluminium Oxide**=స్ఫటకామ్లజనిదము.

" **Sulphate**=స్ఫటకగంధకితము.

**Alveolus**=వాయుకోశము, వాయుగోళము, పల్లు కుదురు.

**Alum**=పటిక.

**Amalgam**=పారదమేళనము; రసమిశ్రలోహము; నవనీతము.

**Amber**=తృణస్ఫటికము; కర్పూరపూస (పచ్చనిది).

**Ambiguous**=సంశయాత్మక; సందిగ్ధమైన; అస్పష్టమైన; రెండర్థములుకల.

**Ambiguous case**=సందిగ్ధపు బాపతు (విషయము, సందర్భము).

**Amenorrhea**=క్షీణార్తవము; ముట్టుడుగుట; ఋతుస్రావముతగ్గుట.

**American aloe**=రాకాసిమట్ట.

**Amethyst**=నీలమణి, ధూమ్రవర్ణముగల మణి.

**Ammonia**=అమ్మోనియా; నవాసారము.

**Ammonium Carbonate**=అమ్మోనియాకర్బనితము, స్మెల్లింగు సాల్టు.

**Ammonium Chloride**=అమ్మోనియా హరిదము.

**Ammonium Hydroxide**=అమ్మోనియా ఉదజామ్లజనిదము

**Ammonium Nitrate**=అమ్మోనియానత్రితము.

Ammonium Sulphide=అమ్మోనియా గంధకితము.

Ammonium Tartarate=అమ్మోనియా తింత్రిణీకము.

Amoeba=వికారిణి; ఇంద్రియరహిత పేశీమయ సూక్ష్మజీవి.

Amorphus=నిరాకారమైన; అనంగతమైన; స్ఫటికముగాఏర్పడని.

Amount=మొత్తము; పెరసి.

Amphibia=ఉభయచరములు; నీళ్లలోను, నేలనుగూడ జీవించు ప్రాణులు.

Amphibolia=శ్లేష్మదోషము.

Amplitude=విశాలము; విస్తీర్ణము; అంతరము; వ్యాప్తి; పరిమితము.

Anaemia=పాండురోగము, రక్తక్షయరోగము.

Anaesthetic=స్మృతి తప్పించుమందు; చేతనాహారకము; జ్ఞానశక్తిహారకము; క్లోరోఫారము, కొకయిను మొదలగు ఔషధములు.

Analogue=సదృశము; సజాతీయు; సాదృశ్యముగలమాట.

Analogy=పోలిక; సామాన్యధర్మము: సాదృశ్యము; ఉపమానము; సాదృశ్యము.

Analogical school=సారూప్య పంథ.

Analysis=విభజనము; అన్వయము; హేతుబోధక విభజనము; పృథక్కరణము; వ్యవచ్ఛేదము.

Anasarca=శారీరశోఫ; ఉబ్బుచూపుట.

Anatomy = శారీరనిర్మాణ శాస్త్రము; శరీరవ్యవచ్ఛేద శాస్త్రము.

Androeciam=కేసరావళి.

Androgynous=అర్ధనారీశ్వరాకృతిగల.

Andromeda=దేవయాని.

Andromede=ఉత్తరాభాద్ర.

Aneurism=ధమనిశోధ; శుద్ధరక్తనాళముల యుబ్బుదల.

Anemophylial pollination=వాయుసంయోగము; గాలివలన నన్యోన్య సంపర్కము కల్గించఁబడిన.

Aneroid Barometer=వాయుభారమితి.

Angina pectoris=హృద్గ్రహము; రొమ్ముశూల, ఎదరురొమ్మునొప్పి.

Angle=మూల; కోణము, కర్ణము.

Angle, acute=లఘు కోణము.

Angle, adjacent=ప్రక్క కోణము; ఆసన్నకోణము.

Angle alternate=ఏకాంతర కోణము.

Angle blunt=మొక్క కోణము.

Angle, circum=పూర్తిగాచుట్టుకొన్న కోణము; సంపూర్ణ పరికోణము.

Angle, corresponding=పోటీకోణము; సంగతకోణము; అనురూపకోణము.

Angle cosine of=కోటిజ్యా.

Angle obtuse=అలఘుకోణము; అధికకోణము.

Angle of depression=నిమ్నకోణము.

Angle of elevation=ఊర్ధ్వకోణము.

Angle of emergence=బహిర్గతికోణము.

Angle of friction=రాపిడికోణము.

Angle of incidence=తేజః పతన కోణము.

Angle of reflection=ప్రతిబింబకోణము.

Angle, plane=సమక్షేత్రకోణము; సమకోణము.

Angle, Reflex=తిరిగియున్నకోణము; వెనుకవంగినకోణము.

Angle, Right=లంబకోణము.

Angle, sine of=జ్యా.

Angle, solid=ఘనకోణము.

Angle, straight=సమ రేఖకోణము, తిన్ననికోణము.

Angle, supplementary = పూరకకోణము; అనుపూర్ణకోణము; సమకోణద్వయపూర్తి.

Angle, vertical = అగ్రకోణము; శీర్షకోణము.

Angle, vertically opposite = అగ్రాభిముఖకోణము; మూలనుండు ఎదుటికోణములు.

Angle of vision = దర్శనకోణము.

Anglemeter = కోణమాని; కోణమాపకము.

Angular = కోణసంబంధ; కోణీయ.

Angular distance = కోణీయాంతరము.

Angular motion = సకోణగతి; కోణాత్మకగతి.

Angular point = కోణబిందు ; కోణాగ్రము.

Anhydride = నిర్జలామ్లము; అమ్లోషితము.

Animal charcoal = శల్యాంగారము.

Animal matter = జంతుద్రవ్యము.

Anion = అనయనము.

Anise seed = సోపు.

Anode = (ఆనోడు) ఉద్గామిమార్గము; ధనధ్రువమునుండి విద్యుత్తుపోవుదారి.

Annuity = వర్షాశనము; వార్షికము; ఏటేట దొరికెడు ద్రవ్యము.

Annual motion = వార్షికగతి.

Annular = కడియపు; వలయాకారమైన.

Annular eclipse = కంకణగ్రహణము.

Anodyne = నొప్పిలేకుండాచేయునది; వేదనశమనౌషధము.

Anopheles mosquito = చుక్కలదోమ.

Anorexia = అగ్నిమాంద్యము; ఆకలిలేకుండుట; అరోచకము; అరుచి.

**Antarctic region** = దక్షిణ ధ్రువమండలము.

**Antecedent** = పూర్వగామి; ముందటి; ముందు వచ్చినది; పూర్వధనము; ప్రధమునిష్పత్తి.

**Antelope** = కృష్ణమృగము; జింక; లేడి.

**Anther** = పుష్పముయొక్క కింజల్కము; పురుషాంగము; పరాగకోశము; పుష్పొడితిత్తి.

**Anthropoid** = మానుషాకారజంతువు; (కోతి).

**Anthropology** = మనుష్య వర్ణనశాస్త్రము.

**Anthrox bacillus** = దొమ్మరోగపు సూక్ష్మదండిక.

**Anticlockwise** = అప్రదక్షిణము.

**Antidote** = విరుగుడు; విషాపహారము; విషపరిహారకౌషధము.

**Antigonon** = తీగగులాబి.

**Antilogarithm** = సంవర్గ మానప్రతిసంఖ్య; ఘాతాంక ప్రతిసంఖ్య.

**Antimony sulphide** = సుర్మా; సౌవీరము; అంజనగంధకిదము

**Antinode** = అంటినోడు.

**Antipodal cell** = ప్రతిపాదకణము; ఎదురుగానుండు కణము.

**Antipodes** = ప్రతిపదవర్తులు; గోళార్ధాంతరవాసులు.

**Anti pyretics** = జ్వరనివారిణులు.

**Antiseptics** = క్రిమిఘ్నములు; పూతినాశకము; కుళ్ళిపోకుండచేయునవి.

**Antitoxin** = శరీరజన్య విషఘ్నము; శరీరమునందు విషమునకు విరుగుడు.

**Anvil** = దిమ్మె; దాకలిరాయిముక్క; కమసాలివాని దాగలిపట్టెడ.

**Anus** = గుదము.

**Aorta** = మహాధమని; బృహద్ధమని.

**Aperture** = సూక్ష్మరంధ్రము.

**Aperture silt** = సన్నబెజ్జము; చీలిక; అక్షవిస్తృతి.

Apex = మొన; శిఖరము; శిఖ; అగ్రము.

Aphelion = ఉచ్చ.

Aphonia = మూగతనము; (హిస్టీరియాలో) గొంతుబొంగురు; స్వరభంగ రోగము.

Aphorism = సూత్రము; నీతిపలుకు.

Aphrodisiac = వాజీకరము; శుక్రలము; కామోద్దీపకము.

Apical bud = కొనమొగ్గ.

Apical cell = అంత్యకణము.

Apical meristem = అంత్యవిభాజ్యపు.

Apiculture = మధుమక్షికాపాలనము.

Apocarpous ovary = విభక్తాండాశయము.

Apocarpous pistil = విభక్త పిండాశయము.

Apogee = మందోచ్చ; తుంగము.

Apoplexy = సంన్యాసము; అంగవికృతిరోగము; రక్తజమూర్ఛ.

Apparatus = ఉపకరణములు; ప్రయోగసాధనములు; పరికరములు.

Apparent Apogee = చలోచ్చ.

Apparent depth = దొంగలోతు.

Apparent expansion = కృత్రిమ వ్యాకోచము.

Apparent motion = దృశ్యగతి.

Appendicitis = క్రిముకశోఫ; అంత్రప్రదాహరోగము.

Appendix = ఉనుకపుచ్ఛము; క్రిముకము.

" Vermiform = క్రిముకము; క్రిమిక.

Application = అన్వయము; ఉపనయము.

Appliances = పరికరములు; ఉపకరణములు.

Approximation = సన్నిహితము; రమారమి; ఉజ్జాయింపు; ఇంచుమించు; సుమారు; స్థూలఫలము; మదింపులెక్క.

Approximate value = ఉజ్జాయింపు; అందాజాకొలత; అందాజావిలువ.

Apricot = జల్దారుపండు.

Apthae = నోటిపుండు.

Aqua fortis = బంగారు మొదలగువాని కరిగించు ద్రావకము.

Aqua marine = పచ్చరాయి.

Aqua Regia = ద్రవరాజము; బంగారుకరిగించు ద్రావకము.

Aquarii = శతభిషము.

Aquarium = జలచర ప్రదర్శనశాల.

Aquarius = కుంభరాశి.

Aquatic = జలసంబంధమైన; జలసంచరమైన.

Aquative = జలచర.

Aqueduct = కాలువ; పొర్లుమదుము.

Aqueous humour = జలాకార రసము.

Aqueous rocks = జలజశిలలు.

Aquila = గరుడుడు.

Aquilae = శ్రవణ.

Aquiline = గరుడపక్షివంటి; గరుడపక్షి సంబంధమైన; వంగిన.

Ara = పీఠము; వృశ్చికరాశికి దక్షిణమునగల నక్షత్రమంజరి.

Arable = దున్నదగిన.

Arable land = సాగునేల; కృషియోగ్యభూమి.

Arbitrary = తనకిష్టమైన; నిబంధనలేని; స్వచ్ఛందమైన; నిర్హేతుకమైన.

Arboriculture = తరుకృషి.
Arc = జ్యా; వర్తులములో నొకభాగము; వంపు; చాపము; ధనురాకారము.
Archeology = పురాతన వస్తుశాస్త్రము.
Archetype = మూలమూర్తి; ఆదర్శము.
Archipelago = ద్వీపసమూహముగల సముద్రము.
Architecture = శిల్పశాస్త్రము; వాస్తుశాస్త్రము.
Arctic = ఉత్తరధ్రువపు.
Arcturus = స్వాతినక్షత్రము.
Area = క్షేత్రఫలము; విస్తీర్ణము.
Areca = పోకచెట్టు.
Argent = వెండిలోచేసిన.
Argol = బంకమన్ను.
Argon = అర్గాను; అర్గనము (ర)
Argument of a function (independant variable) = స్వతంత్ర చలరాశి.
Argumentum ad hominium (cavil) = వితండవాదము.
Arid = జలశూన్య ప్రదేశము,
Aries = మేషరాశి.
Aril = బీజపుచ్ఛము.
Arithmetic = అంకగణితము.
Arithmetical first term = అంకగణిత సంబంధమైన ఆదిపదము.
Arithmetical last term = అంకగణిత సంబంధమైన అంత్యపదము.
Arithmetical middle term = అంకగణిత సంబంధమైన మధ్యపదము.
Arithmetical progression = అంకశ్రేఢి.

Arithmetical term = పదము; ధనము.

Arm = బాహువు; శాఖ.

Armadillo = నఖమృగము; ఘుణము.

Armature = కవచము.

Arm hole = చంక. Arm-pit = చంక.

Arms of an angle = కోణభుజములు.

Arrestment = నిరోధము.

Arrow point = అమ్ముకొన; బాణాగ్రము; బాణపుటలుగు.

Arsenic = పాషాణము; తాలము (ర)

Arsenic sulphide = మణిశిల; తాలగంధకిదము.

Artery = ధమని.

Artesian wells = నీటిబుగ్గలు; గొట్టము నూతులు.

Arthritis = కీళ్లవాపు; సంధిశోఫ.

Articulata = సంధియుతములు; కీళ్లుకలవి. (జీవ)

Artificial classification = కృత్రిమవర్గనిరూపణము.

Artificial magnet = కల్పితాయస్కాంతము.

Artificial respiration = కృత్రిమశ్వాస; ప్రయత్నపూర్వకముగా ఊపిరి ఆడునట్లు చేయుట; ఆగిపోయినశ్వాసను కల్పించుట.

Asafoetida = ఇంగువ.

Asbestos = అస్బెస్టాస్; రాతినార.

Ascertainment = నిర్ణయము.

Ascites = జలోదరము.

Asexual = నిర్లింగము.

Asp = కట్లపాము.

Asparagus = తోటకూరదినుసు.

Asphyxia = శ్వాసబంధము; శ్వాసావరోధము; ఊపిరి తిరుగకపోవుట.

Aspirator bottle = శోషణపాత్ర; వాయుగ్రహణపాత్ర.

Assimilation = గ్రహణము; జీర్ణముచేసికొనుట.

Assimilation of fractions = అంశసవర్ణము; భాగజాతి.

Associative law = సంయోగన్యాయము.

Asterism = స్థిరము గానుండు నక్షత్రసమూహము.

Asteroids = అల్పగ్రహావళి; లఘుగ్రహములు; నక్షత్రాకారముగల చిన్న గ్రహములు.

Asthma = తమకశ్వాసము; ఉబ్బసము.

Astigmatism = నేత్రావరోధము; దృష్టిలోపము.

Astral = నక్షత్రసంబంధమైన.

Astral body = లింగదేహము; లింగశరీరము.

Astringents = స్తంభనములు; కషాయములు; రక్తనాళములను ముకుళింపచేయునవి; అవయవములను ముడుచుకొనునట్లు చేయునవి.

Astronomy = ఖగోళశాస్త్రము; జ్యోతిశ్శాస్త్రము.

Asylum = రక్షకస్థానము; శరణాలయము.

Asylum, Lunatic = పిచ్చివాండ్ర వైద్యశాల.

Asymmetry = ఈడుజోడులేమి; అసమ విభక్తాంగత్వము; అసమానయవత్వము; అసౌష్ఠవము.

**Atherminous** = ఉష్ణకిరణహారి.

**Atlas** = అట్లాసు; దేశపటముల పుస్తకము.

**Atlas (bone)** = కంధరపూస; (వెన్నుపూసలలో మొదటిది); చూడా కలయము.

**Atmosphere** = వాతావరణము; ఆకాశము.

**Atom** = పరమాణువు; అణువు; కణము; లేశము.

**Atomic theory** = పరమాణువాదము.

**Atomic weight** = పరమాణుభారము.

**Atrophy** = కార్శ్యము; క్షయము; అపోషణక్షయ; పోషణలేనందున క్షీణించి నిరుపయోగమగుట.

**Attraction** = ఆకర్షణము.

**Attraction sphere** = ఆకర్షణబింబము.

**Attribute** = ధర్మము; లక్షణము; గుణము.

**Auditory canal** = కర్ణనాళము; కర్ణరంధ్రము.

**Auditory nerve** = కర్ణనాడి.

**Auger** = బరమా; కర్రిసు; తొలుచు పనిముట్టు.

**Auricle** = కర్ణిక (అలిందము)

**Auriculate** = కర్ణాకారము.

**Auriculo-ventricular orifice** = కర్ణికాజఠరికాద్వారము.

**Auriga** = సారథి.

**Aurist** = కర్ణవ్యాధులను బాగుచేయువాడు; కర్ణవైద్యుడు.

**Aurora Borealis** = సుమేరుజ్యోతి; ఉత్తరధ్రువమండలమందు కనబడు జ్యోతి.

Auscultation = హృదయధ్వనులను వినుట; హృదయధ్వనిపరీక్ష.
Austral = దక్షిణపు.
Autares = జ్యేష్ఠ.
Autograph = స్వహస్త లిపి; స్వహస్తాక్షరి.
Automatic movement or Automatism } = తనంతట తాను చలించునది; స్వయంగతిక ము.
Autumn = శరదృతువు; ఆకురాలు కాలము.
Autumnal Equinox = తులాసంపాతము.
Avalanche = హిమావసరణ; కొండమీదునుండి దొర్లిపడెడు మంచుగడ్డ.
Average = సరాసరి; అసమరాశులకు సమప్రతినిధి; (జోసత); సగటు; దామాషా.
Average velocity = సగటువేగము; దామాషావడి.
Aves = పక్షులు.
Avicennia = మాద.
Avoirdupois = (అవార్డు పాయిస్) భారవస్తు తులామానము.
Awl = ఆరె; మాదిగవానికదురు.
Axil = ఆకుమూల; చంక; కణుపుసందు.
Axial bundle = నడిమికట్టు.
Axillary or Axile placentation } = స్తంభసంయోగము; కుడ్యసంయోగము.
Axillary bud = పంగమొగ్గ.
Axil of leaf = ఆకుపంగ.
Axiom = విస్పష్టన్యాయము; స్వయంసిద్ధము; అధారన్యాయము; సాక్షాత్తత్వప్రతిపాదక సిద్ధాంతము.
Axis = అక్షము; అక్షరేఖ; భ్రమణాధారము; మేరువుపూస; దంతచూడ.

**Axis of co-ordinates** = సంబంధాక్షము.

**Axis major** = దీర్ఘాక్షము.

**Axis of a mirror** = దర్పణమధ్యరేఖ.

**Axis of symmetry** = అవయవానురూపత్వ అక్షరేఖ; సమవిభక్తాక్షము; సౌష్టవాక్షము.

**Axle** = ఇరుసు.

**Azimuth** = దక్షిణదూరము; గ్రహముల సమాంశ.

# B

**Bacillus** = సూక్ష్మదండిక; జీవాణువు; బీజాణువు.

**Backbone** = వెన్నెముక.

**Bacteria** = బాక్టీరియా: సూక్ష్మజీవులు.

**Bacterial diseases** = సూక్ష్మజీవులవల్ల కలుగువ్యాధులు;.

**Bacterium aceti** = సూక్ష్మసారిక.

**Bacterium lacto** = సూక్ష్మక్షీరిక.

**Bacterium termo** = సూక్ష్మతరుల్కువు.

**Balance** = త్రాసు. **Balanced** = సరితూగు.

**Balance Sheet** = ఆదాయవ్యయశేషపత్రము; అవశిష్టపత్రము; శేషపత్రము; అంకణాజాబితా; అడవాపట్టిక; బాకీహిస్సేబు.

**Balancing Wheel** = సమీకరణ చక్రము.

**Balancing point** = సరితూగుచోటు.

**Baldness** = బట్టతల; ఇంద్రలుప్తము.

**Ball and socket joint** = బంతిగిన్నకీలు.

**Ballast** = పడికట్టు (బరువు); నిలకడకొఱకు వేయు భారము.

**Balloon** = విమానము; గాలివిమానము.

Balsam = నీలిగోరింట; సాంబ్రాణితైలము, చిలుకముక్కుపువ్వు; కాశీతుమ్మి.

Banana = ఒకవిధమైన అరటిచెట్టు; లేక పండు.

Bandage = (గాయము) కట్టు; బంధనము.

Banian tree = మఱ్ఱిచెట్టు.

Barbs = కర్ణికలు.

Barium = భారము (ర)

Barium chloride = భారహారిదము.

Barium sulphate = భారగంధకితము.

Bark = బెరడు; చెట్టుపట్ట.

Barley = (పచ్చ) యవలు.

Bar magnet = దండాయస్కాంతము.

Barnacle = ఒక విధమైన నత్తగుల్ల; ఒక జాతి గుడ్లగూబ.

Barograph = భారలేఖిని; ఒత్తిడిచూపుయంత్రము.

Barometer = వాయుభార మాపకము; భారమాపకము; వాయుమాత్రి; భారమితి.

Baroscope = భారదర్శిని.

Basal = పీఠసంయోగము.

Basalt = బసాల్టుశిల.

Base = భస్మము; లవణమూలము పీఠము; పునాది.

Base level = అడుగుమట్టము.

Base line = ఆధారరేఖ; మట్టపుగీత.

Base of logarithm = సంవర్గమానమూలము.

Base of a triangle (e.g.,) = మూలము; భూమి; అడుగు; ఆధారము.

Basic = లవణాధార; భస్మిక.

Basil = రుద్రజడ. Basil, holy = తులసి.

Basin of a stream = ప్రవాహ ప్రదేశము.

Bastard saffron = కుసుంబా.

Bastard teak = మోదుగ.

Battery = విద్యుద్ఘటము; విద్యుజ్జనకము: విద్యుద్ఘటమాల.

Bay = వియుక్తాగ్ర గుడము; అఖాతము, ఉపసాగరము.

Bayonet = తుపాకీకొసను తగిలించుబాకు; తుపాకిమొన.

Bdellium = గుగ్గిలము.

Beacon light = గుఱుతుదీపము.

Bead = పూస.

Beak = ముక్కు; వాక్పుటములజత.

Beam = దండెము;దూలము.

Beam of light = తేజఃపుంజము.

Beagle = చిరువేటకుక్క.

Bean = చిక్కుడుకాయ (గింజ)

Bearing = దిశ; దిక్కు; (చెట్టు) కాపు; కానుపు; ఈనుట.

Beats = శృతిసంకరము.

Bed-sore = అధికాలము మంచముపట్టుటచే కలుగు పుండు; శయన వ్రణము.

Beech-Indian = కానుగ.

Bee-hive-shelf = వాయుసంగ్రహణ సాధనము.

Beetle = కుమ్మరి పురుగు; పేడపురుగు.

Bel-fry గంట (గల) గోపురము; ఘంటాలయము.

Bell-jar = ఘంటాకారపాత్రము; గంటజాడి.

Bell-metal = కంచు.
Bellows = కొలిమితిత్తులు.
Bench mark బెంచిమార్కు; సర్వేగుఱుతు.
Bending of light rays = కిరణ కుటిలత.
Bent-grass = దూర్వ; ఒకదినుసుగడ్డి.
Bent-tube = వక్రనాళిక.
Benzoin = సాంబ్రాణి.
Bergamot = కమలా; నారింజజాతి చెట్టు.
Beriberi = తిమురువాయువు; ఉబ్బువాతవ్యాధి.
Berny = కండకాయ.
Berry = గుటిక; గింజ.
Beryllium = విదురము (ర).
Betel = తమలపాకుతీగె.
Betel-nut = వక్క; పోకచెక్క.
Bevel = కోణములను కొలిచి సరిపుచ్చెడి సాధనము.
Beverages = పానీయములు.
Bezoar = గోరోచనము.
Bhang = గంజాయి.
Bicarbonate = రెండుపాళ్లు అంగారకామ్లము గలది; ద్వికర్బనితము.
Biceps muscle = ద్విశిరకండము; ద్విశిరస్కు; ద్విశిరస్కపేశ్యము.
Bicompound leaf = ద్విభిన్నపత్రము.
Bicuspids = చీలిక పండ్లు.
Bicuspid valve = కిరీట పిధానము; ద్విపత్రిక పాటము.
Bicycle = సైకిలు, తొక్కుడు బండి.
Bilberry = కొరిండపండు.

Bile = పైత్యరసము.

Bile duct = పిత్యరసపు నాళము (గొట్టము); పైత్యవాహిక; పిత్త నాళిక.

Biliousness = పైత్యోద్రేకము.

Bill = లెక్కచీటి; హుండీ.

Billion = మహాపద్మము; లక్షకోట్లు.

Binary fisson = రెండుగా చీలుట.

Binary stars = జంటతారలు.

Binocle = జంటదుర్భిణి; జమిలిదుర్భిణి.

Binomial = బీజగణితమందు రెండు సంఖ్యలరాశి; ద్విపద, ద్వినామి.

Binominal = ఉభయాంగ; ద్వినామిక; ద్విపద; రెండు పేర్లుగల.

Biogenesis = జీవోత్పత్తి క్రమము.

Biology = జీవశాస్త్రము.

Biological treatment = జీవసాహాయ్యక చికిత్స.

Biquadratic = చతుర్ఘాత; ద్వివర్గము.

Birth wort, Indian = ఈశ్వరవేరు.

Bisection = ద్విఖండనము; రెండు సమభాగములు చేయుట, సగము చేయుట.

Bisector = విదళనరేఖ; సమభాగిని.

Bishops weed = ఖురాసానివాము; ఓమపుచెట్టు.

Bismuth = బిస్మతు; తగరమువంటి ఒక లోహము.

Bison = కారెనుము; ఎనుబోతు.

Bissextile = దినాధిక సంవత్సరము; 'లీపు' వత్సరము.

Bistury (Bisterre) = "బిస్టూరీ" శస్త్రచికిత్సయం దుపయోగింపబడు వంకరకత్తి.

Bitch = ఆడుకుక్క.

Bite = దంశము; కాటు.

Bitnoben = బిడాలవణము.

Bitter = చేదు.

Bittern = తుంపొడియను పక్షి.

Bitter apple = పాపరబుడమ.

Bitter orange = నారదబ్బ.

Bitter wild melon = చేదుపుచ్చ.

Bitumen = శిలాజిత్తు తైలము; మట్టితైలము.

Black cumen = నల్లజీలకర్ర.

Black mustard = సన్న ఆవాలు:

Black pepper = మిరియములు.

Black plum = నేరేడు.

Black-oil = మాల్కంగిని తైలము.

Black wood = విఱుగుడుమ్రాను.

Bladder (gall) = పిత్తాశయము; (పసరు తిత్తి).

Bladder (urinary) = మూత్రాశయము (ఉచ్చబుడ్డ); వస్తి.

Blade = అకు; కత్తిఅరు.

Blade-bone = రెక్కఎముక.

Blain = చీముకుఱుపు; బొబ్బ.

Bleaching = విరంజనము; స్వచ్ఛకరణము; బట్టలు చలవచేయుట.

Bleaching powder = చలువసున్నము; విరంజనచూర్ణము.

Blear = పుసికట్టిన; మసకగా నున్న (కన్ను).

Bleb = పొక్కు;

Blepharitis = పక్ష్మశోథ; రెప్పవెంట్రుకలూడుట; కనురెప్పలుబ్బుట.

**Blind spot** = గుడ్డిచుక్క.

**Blizzard** = హిమపవనము; హిమసహితఝంఝామారుతము; చీకటి కలిగించు హిమవర్షము.

**Block pulley** = కప్పీచట్రము.

**Block tin** = తగరపు ముద్ద.

**Blood corpuscles** = రక్తకణములు.

" red corpusles = ఎఱ్ఱరక్తకణములు.

" white corpuscles = తెల్లరక్తకణములు.

**Blood poisoning** = రక్తగతవిషదోషము.

**Blood-sucker** = తొండ, ఊసరవెల్లి; రక్తముపీల్చుజంతువు (జలగ).

**Blood-vessel** = రక్తవాహిక; రక్తనాడి; రక్తనాళము.

**Bloody-flux** = నెత్తురు విరేచనములు.

**Blotch** = మచ్చ; చెమటకాయ.

**Blue litmus** = నీలి లిట్మసు.

**Blue-stone (Blue vitriol)** = మైలుతుత్తము.

**Blunderbuss** = పొట్టిమూతివెడల్పు తుపాకి.

**Boar** = మగపంది.

**Bobtail** = మొండితోకగలజంతువు.

**Boa (Boa-constrictor)** = కొండచిలువ.

**Bodkin** = దబ్బనము; పెద్దసూది.

**Boel** = మారేడు.

**Bog** = బురదనేల.

**Boil** = పుండు; కురుపు.

**Boiler** = బాన; కాగు.

**Boiling point** = ఎసరువేడిమి.

Bolter = జల్లెడ,

Bolus = పెద్ద మాత్ర; గుటిక.

Bonduc-nut = గచ్చకాయ.

Bone (frontal) = లలాటాస్థి.

Bone meal = ఎముకపొడి.

Bone (occipital) = శిరఃపృష్ఠాస్థి; పశ్చిమకపాలము.

Book-worm = చిమ్మెట పురుగు; రామ బాణము.

Bootes = భూతపము; స్వాతి.

Bootes, Arcturus = స్వాతి; తారకపుంజము.

Borax = వెలిగారము.

Bordeaux = ద్రాక్షారసము.

Boron = టంకము.

Bostryx (Helicoid cyme) = శంఖమధ్యారంభ మంజరి.

Botany = వృక్షశాస్త్రము; ఓషధీశాస్త్రము.

Bottle gourd = సొరకాయ; అనపకాయ.

Boulder = గండశిల.

Boundaries = ఎల్లలు; సరిహద్దులు.

Bowels = ప్రేవులు; అంత్రములు.

Bracket = కుండలీకరణము; అనగా ( ) నిట్టిగురుతు; వలయుతము; వృంతదళము.

Bruct = తొడిమ; ఉపపత్రము; చేటిక.

Brail = తెరచాపగుడ్డ.

Braille = గ్రుడ్డివారికోసము వ్రాసినవ్రాత.

Brain = మెదడు; మస్తిష్కము.

Brain-pan = తల పుఱ్ఱెఎముక.

Bramah Press = ఉత్పీడన యంత్రము.

Bramble = ముండ్లచెట్టు.

Brass = ఇత్తడి; పిత్తలము.

Braze = ఇత్తడి టంకపు అతుకు.

Bread-corn = రొట్టెలధాన్యములు (గోధుమలు మొ॥)

Bread-fruit = పనసవంటి చెట్టు.

Break-water = సేతువు; ఆనకట్ట.

Break-waters = ఆహూతి తరంగములు.

Bright's disease = బ్రైట్సువ్యాధి; మూత్రపిండరోగము.

Bristol stone = పుష్యరాగము.

Brittleness = భిదురత ; పెళుసుదనము.

Broad axe = గండ్రగొడ్డలి.

Brokerage = తరుగు ; కమీషను ; (కోత) కాయిదా ; దలాలీ.

Bromine = స్రంభము (ర)

Bronchii = వాయు నాళములు; శ్వాసనాళములు.

Bronchial tubes = వాయునాళములోనిసన్నగొట్టములు ; వాయునాళముల శాఖలు; సూక్ష్మశ్వాసనాళములు.

Bronchitis = శ్వాసనాళీప్రదాహము ; సూక్ష్మ శ్వాసనాళికారోగము, ఱొమ్ము పడిసెము.

Bronchocele = గండమాలరోగము.

Broncho-pneumonia = (బ్రాంకోన్యూమోనియా) సూక్ష్మశ్వాసనాళ పుప్పుస ప్రదాహజ్వరము; ఱొమ్ము పడిసెము, ఊపిరితిత్తులవాపు జ్వరము.

Bronchus = శ్లోమశాఖ; (శ్వాసకోశములకు పోవు రెండు ప్రత్యేక నాళములు) వాయునాళము.

Bronze = కంచు.

Broth = చారు; రసము; (కంది) కట్టు.

Brooding = పొదుగుట.

Bruise = నలుగుట ; గాయమగుట ; చితుకుట.

Bryology = నాచు జాతిమొక్కల శాస్త్రము.

Bryony = దొండవంటి తీగ ; ఏటిపుచ్చ ; బుడమ.

Bryophyllum = రణపాల ; పత్రజీవి.

Bubbly jock = టర్కీకోడి.

Bubo = పడిసెగడ్డ ; చంకలోగాని, గజ్జలలోగానివచ్చుబిళ్ళ (సంకటము).

Bubonocele = గజ్జలలోపుట్టు ఒఱుబీజము ; అంత్రవృద్ధులలో నొకటి.

Buccal = నోరు; దవుడ సంబంధమైన.

Buck = మొగలేడి, చెవులపిల్లి.

Buck - thorn = రేగు చెట్టు.

Budding = స్ఫోటనము ; మొగ్గతొడుగుట.

Buff = గేదతోలు.

Bulb = గోళకము; లోపల బోలుగా నుండు కుండ; లశునము; గడ్డ;

Bulb-tube = కందనాళిక.

Bulbul = పిగిలిపిట్ట.

Bullace = కొరిందకాయచెట్టు.

Bull-rush = జమ్ము.

Bum = పిఱుదులు.

Bumble-bee = తుమ్మెద.

Bunion = మడమశూల.

Buoy = ప్లవలు; తేలుడుగుండ్లు; బోయాకట్టె.

Buoyancy = తేలుడుగుణము.

Burner = బర్నరు; దీపములో వత్తిగలభాగము.

Burns — కాలినపుండ్లు.

Burr — గుండ్రని అంపము.

Burrow — బొరియ; బిలము.

Bushel — బుషలు, ఇంగ్లీషు కొలతవిశేషము.

Butcher-bird — బెగురుకొంగ; దూడేకులపిట్ట.

Butter-fly — సీతాకోకచిలుక; ఆకుచిలుక.

Butter-tree — ఇప్పచెట్టు.

By-compound — ద్విభిన్నము.

Byre — ఆవులశాల.

## C

Cabbage — కోసుకూర.

Cable-gram — సముద్రతంతి; నావమోకు.

Cacao — కోకోచెట్టు సంబంధమైన.

Cactus — నాగదారి; బ్రహ్మజెముడు ; నాగజెముడు జాతి.

Cachalot — ఒకవిధమైన తిమింగలము.

Cadaverous — పీనుగువంటి; మృతప్రాయము; ప్రేతసదృశము.

Cadjan — తాటిఆకు.

Cadmium — కాద్మము (ర) తగరమువంటి లోహము;

Caecum — పురీషోండుకము; ఉండుకము. ఏకముఖనాళము.

Caesal pinia — తురాయిచెట్టు.

Caesium — శ్యామము (ర)

Caffeine — కాఫీన్; కాఫీగింజలలోనుండు విషపదార్థము.

Calabash — నాగస్వరపు బుర్రకాయ; గుమ్మడివంటి తీగె.

Calcaneum — మడమయెముక.

Calcination — సున్నము చేయుట; భస్మీకరణము.

Calcined mercury = రసభస్మము.

Calcium = ఖటికము; సున్నపుభస్మము.

Calcium Carbide = ఖటిక కర్బనిదము.

Calcium Carbonate = ఖటిక కర్బనితము.

Calcium Chloride = ఖటిక హరిదము.

Calcium Phosphate = ఖటికభాస్వరితము.

Calculus = మూత్రకృచ్ఛ్రము; అశ్మరి (2) కలన (గణిత) పద్ధతి.

,, Biliary = పిత్తాశ్మరి; పైత్యకృచ్ఛ్రము; పిత్తాశయమునందు రాళ్ళేర్పడుట.

,, Differential = శూన్యలబ్ధి; చలనకలనము (గ)

,, Imaginary = కల్పితకలనము (గ)

,, Integral = మూలఫణితి; సమాహార గణితము; చలరాశికలనము.

,, Intestinal = అంత్రాశ్మరి.

,, Renal = మూత్రపిండాశ్మరి.

,, Urinary = మూత్రాశ్మరి; అశ్మరి; మూత్రాశయమునందేర్పడురాళ్లు

,, Vesical = వస్తిగత అశ్మరి; మూత్రాశయాశ్మరి.

Calendar = పంచాంగము, తారీకులదర్శిని.

Calender = కాగితముల నునుపుచేయు యంత్రము.

Calibre = అడ్డకొలత ; వృత్తద్వారముయొక్క అంతరవ్యాసము.

Calibration = స్ఫుటముచేయుట.

Callipers = రెండుబిమ్మలమధ్య దూరమును కనుగొను పనిముట్టు.

Callosity = కాయ ; కిణము.

Callus = శరీరముపైన (పెరుగు)కాయ.

Calomel = రసకర్పూరము ; రసభస్మము.

Caloric = ఉష్ణము; వేడిమి. Calorimetry = ఉష్ణనిర్ణయము.

Caltrop - small = పల్లేరు.

Calx of iron = లోహభస్మము.

Calyx = పుష్పపాత్రము; పుష్పకోశము, పూవుయొక్క రక్షకపత్రావళి.

Cambrium = విభాజ్యకణములవరుస ; వర్ధకావళి.

Camelopard = ఒంటెవలెనుండు నొకజంతువు.

Camelo pardalis = కరభము.

Camera = (కెమిరా); ఛాయాపటగ్రాహణయంత్రము.

Camomile = చేమంతి జాతి.

Camphor = కర్పూరము.

Cancel = కొట్టివేయు; రద్దుచేయు.

Cancer = కర్కటరాశి; ఎండ్రకాయ; పీత (2) దుష్టగ్రంథి; మాంసార్బుదము.

Canori = పుష్యమి; అశ్రేష.

Candle = క్రొవ్వువత్తి; మైనపువత్తి.

Canes Venatici = విశ్వకద్రువు.

Canine teeth = కోరపండ్లు.

Canis major = బృహల్లుబ్ధకము.

Canis minor = లఘులుబ్ధకము.

Canker = కొఱుకుపుండు; కుళ్లు.

Canna = కొట్టతామర.

Canopus = అగస్త్యుఁడు.

Canvas-back = బుడ్డకోడి.

Capacity = పట్టెడుశక్తి; గ్రాహణశక్తి; ధారణశక్తి.

Capacity, electricity = విద్యుద్ధారణశక్తి.

Capacity, heat = ఉష్ణగ్రాహణశక్తి.

Cape = అగ్రము.

Capella = బ్రహ్మహృదయము.

Capillaries = కేశ (రక్త) నాళికలు.

Capilarity = అభిసర్పణము; ద్రవపదార్థములనుఎగబీల్చుకొనుశక్తి.

Capillary attraction = ఎగలాగుశక్తి; సూక్ష్మనాళాకృష్టి.

Capital = మూలధనము; పెట్టుబడి; పరిపణము (2) ముఖ్యపట్టణము.

Capitulum = బంతి.

Capricorn = మకరరాశి.

Capsicum = మిరెపచెట్టు.

Capsule = బీజకోశము; బహువిదారణఫలము; ఔషధగుటిక.

Carat = బంగారముయొక్క వన్నె, 24 వ భాగము; వజ్రపుతూనిక, ఒకరతి నాలుగువడ్లగింజల యెత్తు.

Caravan = బిడారు; సార్థవాహము; బాటసారుల సమూహము.

Caraway = సీమసోపు విత్తులు.

Carbide = కర్బనిదము.

Carbo-hydrate = పిండిపదార్థము; కర్బనోజ్జనితము.

Carbolic acid = కార్బాలిక్ ద్రావకము.

Carbon = అంగారము, బొగ్గు, కర్బనము (ర)

Carbon assimilation = కర్బనగ్రహణము.

Carbonates = కర్బన మిశ్రమములు; కర్బనితములు.

Carbonates of Calcum and magnesium = ఖటికమగ్న కర్బనితములు.

Carbonate of potash = మానుప్పు.

Carbon dioxide = కర్బనద్వ్యమ్లజనిదము.

Carbon-di-sulphate = కర్బనద్విగంధకిదము.

Carbonic acid gas = అంగారక్షారవాయువు, బొగ్గుపులుసుగాలి.

Carbuncle = రాచపుండు ; సూర్యకాంతమాణిక్యము.

Carcase (Carcass) = పీనుగు; డొక్కు; కళేబరము.

Cardamom = ఏలకికాయ.

Cardiac = గుండెకాయ సంబంధము.

Cardialgia = హృదయమునందు మంట ; గుండెమంట.

Caret = హంసపాదము; "∧" ఇట్టి గుఱుతు.

Caries = ఎముకపుచ్చు రోగము.

Cargo = సరకు; ఓడపై కెక్కించు సరకు.

Carminatives = జీర్ణకారులు; వాయుహర ఔషధములు.

Carnivorous = మాంసభక్షక; మాంసాహారి.

Carnissals = కత్తెరపండ్లు.

Carotid artery = మన్యధమని; మెడగుండపోయెడి పెద్దధమని; గళధమని.

Carp = గండుచేప; బెడిసమీను; శఫరము.

Carpal bones = మణికతములు.

Carpel = పుష్పగర్భము; స్త్రీపత్రము; ఫలదళము; కమలాపండు.

Carpus = మణిబంధాస్థి.

Carrier-ball = శోధనగోళము.

Carrion crow = కాకి.

Carron oil = కారన్ నూనె.

Carrot = కారటిదుంప; గర్జర; గాజర; పచ్చముల్లంగి.

Cartilage = ఉపాస్థి; తరుణాస్థి; కోమలాస్థి; కూర్చ.

Caruncle = కోడిమెడక్రింద వ్రేలాడు మాంసపుకండ.

Casein = పాలమీగడలోనిమాంసకృత్తులు; పాలవిరుగు.

Cassia = కసింద చెట్టు.
Cassiopea = శర్మిష్ఠ.
Cast-iron = పోతలోహము.
Causation = కారణత్వము.
Casuarina = చవుకుచెట్టు; సరుగుడు చెట్టు.
Catadromous = గుడ్లుపెట్టుటకు నీటిలోనికి పోవుజీవులు.
Catalépsy = అపస్మారము.
Catamenia = రజస్సు; స్త్రీ ఋతువు; మైల.
Catarrh of bladder = మూత్రాశయ స్రావరోగము.
Caterpillar = అకుపురుగు.
Caterpillar, hairy = గొంగళిపురుగు.
Catchew nut = ముంతమామిడి; జీడిమామిడి.
Catchment area = పట్టుబడి ప్రదేశము.
Categorical proposition = అనధీనవాక్యము; అనన్యవాక్యము.
Categories = పదార్థములు; వర్గములు.
Cat's eye = వైడూర్యము.
Cauli flower = ముట్టుకోసుకూర.
Caustics = పొక్కునట్టివి (మందులు).
Caustic Potash = దాహక పొటాస్.
Caustic soda = దాహక సోడా.
Cedar = దేవదారు చెట్టు.
Celery = ఒకదినుసు తోటకూర.
Cell = కణము; జీవాణువు; (జీవ) ఘటము; జీవకణము.
Cell division = కణవిభాగము.
Cell multiplication = కణగుణనము.

Cell sap = కణరసము; పేశీరసము.

Celluloid = (సెల్యులాయిడ్) వృక్షజీవాణువులతో చేసినది.

Cellulose = సెల్లులోస్; దూదియొక్క గుణవిశేషముగల.

Cement = శిమెంటుగచ్చు.

Cent = శతము; నూఱు.

Centage = శాతము; నూటికిచొప్పున.

Centaurus = నరాశ్వము.

Centigrade = శతవిభాగి; శతవిభాగిని.

Centimetre = శతాంశమీటరు.

Centi pede = జెఱ్ఱి; శతపది.

Central = కేంద్రము; మధ్యగత.

Centre (center) = మధ్య; కేంద్రము.

Centre of curvature = వక్రమధ్యము.

Centre of gravity = గురుత్వమధ్యము; గరిమనాభి.

Centre of inerta = జడనాభి.

Centre of mass = ద్రవ్యనాభి.

Centre of oscillation = భ్రమణమధ్యము; డోలననాభి.

Centre of percussion = సంఘట్టననాభి.

Centre of pressure = ఒత్తిడినాభి.

Centre of similitude = సారూప్యకేంద్రము; సాజాత్యకేంద్రము.

Centre of suspension = డోలాధారము.

Centrifugal = సాధారణ మధ్యారంభి; ధ్రువోత్సారము.

Centripetal = మధ్యపటల; ధ్రువాకర్షణము.

Centroid = గురుత్వకేంద్రము; భారమధ్యము.

Centuple = శతగుణమైన.

Cephalics = శిరస్సంబంధమైన.

Cepheus = వృషపర్వుడు.

Ceramics = కుమ్మరపని.

Cerebellum = గోధ్రము; చిన్నమెదడు; అనుమస్తిష్కము.

Cerebrum = బృహన్మస్తిష్కము; పెద్దమెదడు.

Cerium = శ్రీకము (ర)

Cerumen = గులిమి; చెవిలోని గులిమి.

Ceruse = సీసభస్మము.

Cervical Vertibrae = మెడపూసలు.

Cetaceous = తిమింగిలసంబంధమైన.

Cetus = తిమింగిలము.

Chaff = పొట్టు; (ఊక) ఉముక.

Chain = గొలుసు ; సర్వేగొలుసు; 22 గజములు.

Chain rule = పాశవిధి; శృంఖలానూత్రము; పరంపరాసంబంధము.

Chalcography = రాగిపట్టాలపై వ్రాయుపద్ధతి; తామ్రశాసన లేఖనము.

Chalk = సీమసున్నము.

Chameleon = ఊసరవెల్లి; చిత్రబింబము.

Chamois = కొండజింక.

Chamomile = సీమచేమంతి; చేమంతి.

Chancore (Syphilitic) = ఉపదంశము; (సవాయి) కొరుకుడుపుండు.

Chancre = సవాయిపొక్కు.

Change = మార్పు; వికారము.

Change of phenomena = దృగ్విషయ వికారము.

Change of state = స్థితిభేదము.

Channel = కాలువ; జలసంధి.

Chaotic state = యథేచ్ఛాస్థితి; అస్తావ్యస్తస్థితి.

Chara = వారిపర్ణి.

Characteristic of log = (సంవర్గమాన) పూర్ణము.

Charcoal = అంగారము; కర్బనము; బొగ్గు.

Charcoal, animal = కల్యాంగారము.

Charcoal, wood = ద్రుమాంగారము.

Charles swain = సప్తఋషులరాశి.

Charts = (సముద్రగోళ) పటములు.

Chay root = చిరివేరు.

Cheetah = చిఱుతపులి.

Chemical = రసాయన; రాసాయనిక.

Chemical affinity = రసాయనానురాగము.

Chemical attraction = రసాయనాకర్షణము.

Chemical change = రాసాయనిక వికారము; మార్పు.

Chemical combination = రాసాయనిక సంయోగము.

Chemical compound = రాసాయనిక సమ్మేళనము.

Chemical decomposition = రసాయన వియోగము.

Chemical equivalent = సంయోగపరిమాణము ; రసాయనిక తుల్యశక్తి.

Chemist = రసాయన శాస్త్రజ్ఞుడు.

Chemistry = రసాయన శాస్త్రము.

Chicken pox = శీతాళములు; పొంగు; చిన్నమ్మవారు.

Chick-pea = సెనగగింజ.

Chick-weed = దొగ్గలికూర.

Child welfare = శిశుసంరక్షణ.
Chiliad = వేయి; వేయి సంవత్సరములు.
Chillies = మిరపకాయలు.
Chime = సమతాళము ; ఏకతాళము.
China-root = పరంగిచెక్క; ఫిరంగిచెక్క.
China-rose = మందార.
China-ware = పింగాణిసామాను.
Chin-cough = కుక్కదగ్గు ; మాందదగ్గు.
Chiretta = భూనింబ ; నేలవేముచెట్టు.
Chirographist = సాముద్రికశాస్త్రజ్ఞుడు.
Chiromancy = సాముద్రికము.
Chloral = స్మృతితప్పించు.
Chloride = హారిదము.
Chlorate = హారితము.
Chlorite = హారాయితము.
Chlorine = హారినము (ర)
Chloroform = శస్త్రము చేయునప్పుడు నొప్పితెలియకుండుటకు స్మృతి తప్పునట్లు చేయుఔషధము; క్లోరోఫారము.
Chlorophyl = పత్రిహారితము; పైరుపచ్చన.
Chloroplast = హారిద్వర్ణ శరీర.
Chlorosis = ఋతుదోషజన్య పాండువు.
Cholera = వాంతిభేది; విషూచి; కలరా.
Choleric = పైత్యకారియైన.
Cholerine = (వేసవికాలమున గల్గు) అతివిరేచనములు.
Cholum = జొన్నలు.

Chord = వృత్తభాగము; అల్లెత్రాడు; జ్యా.

Chord of Contact = సంపర్క-జ్యా; స్పర్శజ్యా.

Chorda tendonae = సూత్ర కండరికములు.

Chorda tympani = కపాలము 7 వ నాడినుండి చెవిగూబకు పోవునాడి శాఖ.

Chorea = వికృతనృత్యవాతము; కొంకరులు పోవువాతము; కంప (వాత) రోగము.

Choroid = (అక్షి) మధ్యపటలము; నేత్రనాడి మధ్యపటలము.

Chorion = శిశు పిండము పైపొర.

Chough = ఎఱ్ఱకాళ్ళ కాకి.

Chromatic aberration = వర్ణముష్టాస్పష్టత.

Chromatin = వర్ణేషి.

Chromatophores = హారితకము.

Chrome leather = క్రోముతోలు ; క్రోమచర్మము.

Chromium = క్రోమము (ర)

Chromograph = లేఖనయంత్రము.

Chronometre = (క్రోనొమీటరు) సూక్ష్మకాలమాపకము.

Chrysolite = చంద్రకాంతమణి.

Chunam frog = ఎండుకప్ప.

Chyle = ధాతుపరసము; ధాతుపోషక సారము; అన్నరసము.

Chyluria = పిష్టమేహము.

Chyme = ఆమాశయపాకము.

Cicatrice (cicafrix) = గాయపుమచ్చ; పుట్టుమచ్చ.

Cidar = సీమరేగు సారాయి

Cilia = నూగు.

Ciliary muscle = సిలియరీ పేశ్యము.

Cinchona = క్వినా చెట్టు.

Cinnabar = ఇంగిలీకము.

Cinnamon = లవంగపట్ట; దాల్చినచెక్క.

Cincinus = వృశ్చిక మధ్యారంభ మంజరి.

Cipher = పూజ్యము; సున్న; శూన్యము.

Circle = వృత్తము; మండలము; వర్తులము; వలయము; చక్రము.

Circle auxiliary = విక్షేపవృత్తము.

Circle, circumsribed = పరివృత్తము.

Circle, great = మహావృత్తము.

Circle, inscribed = అంతర్వృత్తము.

Circle, nine-point = నవబిందు వృత్తము.

Circle, Semi = అర్ధవృత్తము.

Circular = వృత్తాకారమైన.

Circular measure = చాపమానము.

Circular motion = మండలగతి; వర్తులగతి; గుండ్రముగ తిరుగుట.

Circulation of blood = రక్తప్రసరణము: రక్తముప్రవహించుట. రక్తాభిసరణము; దేహమందలి రక్తచలనము.

Circulatory organs = ప్రసరణావయవములు.

Circulatory system = ప్రసరణమండలము; నాడీవ్యూహము.

Circum-centre = పరివృత్తకేంద్రము; పరికేంద్రము.

Circum-centre, ex = బాహ్యవృత్తకేంద్రము.

Circum-centre, in = అంతర్వృత్తకేంద్రము; అంతఃకేంద్రము.

Circum-centre, line of = కేంద్రములరేఖ; ఏకసూత్రము; కేంద్రరేఖ.

Heredity = వంశపారంపర్యము.

Hernia = అంత్రవృద్ధి; బుడ్డ.

Herpes = బొబ్బలు; దద్దురులు.

Herpetology = సరీసృపజంతు శాస్త్రము; ప్రాకునట్టి జంతువుల గూర్చినది.

Heterogeneous = సంకర; నానాగణఘాతిక; తిలతండుల పద్ధతి.

Heterogenesis, theory of = విజాతీయ సృష్టివాదము.

Heterospores = వివిధ బీజములు.

Heterostylism = వివిధకీలోత్పత్తి విధానము.

Hexagon, Regular = షడస్రము; షడ్భుజము; షట్కోణాకారము.

Hiccough = వెక్కిళ్లరోగము; ఎక్కిళ్ళవ్యాధి.

Higher plants = ఉన్నతజాతి వృక్షములు.

High lands = మెట్టనేలలు; కొండప్రదేశములు.

High power = ఘనదృక్శక్తి.

High tide = పూర్ణజ్వరభాట; పోటునీటి మట్టము.

High water = పోటు నీటిమట్టము.

Higher fixed point = అధికతర స్థిరస్థానము.

Hill = చిన్నకొండ; మిట్ట; దిబ్బ.

Himalayan cidar = దేవదారు.

,, silver = తాళిసపత్రి.

Hinge joint = మడతబందు కీలు.

Hip joint = తొంటికీలు; సడుగు.

Histogenesis = సూక్ష్మేంద్రియోత్పత్తి (production of organic tissues)

Histology = సూక్ష్మ నిర్మాణము; సూక్ష్మశరీరశాస్త్రము.

Hog-plum = మారేడు పండు.

Hog-weed = గలిజేరుపల్లిక.

Holophytic nutrition = కేవల వృక్షాహారము.

Holozoic nutrition = కేవల జంత్వాహారము.

Holy Basil = తులసి.

Homogeneous = ఏకజాతీయ; సగణసమఘాతిక; క్షీరనీర పద్ధతి.

Homogenesis, theory of = సజాతీయ సృష్టివాదము.

Hoof = డెక్క; గొరిజ.

Hook = కొక్కెము.

Horizon = దిఙ్మండలము; దిగంతము; క్షితిజము.

Horizontal = నీటిమట్టపు; జలోపరిభాగ; దిగంతసమ; క్షితిజసమాంతర; బల్లపరుపు.

Horse power = అశ్వశక్తి; గుఱ్ఱపు బలము; ఒకమినిటుకు 33,000 పౌనుల బరువును ఒక అడుగుపైకి ఎత్తగల శక్తి.

Horse radish = మునగ.

Horse shoe magnet = వక్రస్కాంతము.

Host = స్వాయత్త పరజీవిక.

Hule = చక్రముయొక్క నడిమిభాగము; పిడి.

Humus = ఆకుపెంట; మ్రగ్గిన ఆకులు.

Humerous = భుజాస్థి; దండ ఎముక; ప్రగండిక.

Humidity = ఆర్ద్రత; తేమ.

Hurricane = తుపాను; ప్రచండపవనము.

Husk = ఊముక; ఊఁక; పొట్టు.

Hydra = హైడ్రా అను నీటిపురుగు (2) గొనుకి.

Hydrate = ఉదజనిదము.

Hydraulics = చలజల శాస్త్రము; జలశక్తి శాస్త్రము.

Hydride = ఉదజనితము.

Hydrocele = అండవృద్ధి బుడ్డ.

Hydrochloric acid = ఉదజ హారికామ్లము; లవణద్రావకము.

Hydrochlorate = ఉదజహారితము.

Hydrogen = జలవాయువు; ఉదజని; జలధాతువు.

Hydrogen peroxide = ఉదజని పర్యామ్ల జనిదము.

Hydrogen Sulphide = ఉదజగంధకితము.

Hydrometer = ద్రవసాంద్రతమాపక; జలగురుత్వమాపకము.

Hydrophobia = జలసంత్రాసరోగము; నీటినిచూచినభీతి; పిచ్చికుక్క-కాటువలని వ్యాధి.

Hydrotropism = ఆర్ద్రభ్రమణము.

Hydro phytes = జలవృక్షములు.

Hydrostatics = జలస్థితినిగూర్చిన శాస్త్రము; జలస్థితిశాస్త్రము.

Hydroxides = ఉదజామ్ల జనిదములు.

Hyena = సివంగి.

Hyoscyamus niger = కురాసానివాము.

Hyperbola = అతిపరవలయు.

Hypo = హైపో ధాతువు.

Hypophosphites = అధిస్ఫురాయితములు.

Hypophosphrous acid = అధిస్ఫురామ్లము.

Hyposulphites = అధిగంధకాయితములు.

Hypo cotyl = అతిదళ.

Hypostome = క్రివాయి.

Hypotenuse = కర్ణము; కర్ణి; విషమకర్ణము.

Hypothesis = ప్రతిజ్ఞ; సంభావితము; ఊహ; నిర్ణీతాభిప్రాయము; ప్రవచనము.

Hypothetical కల్పిత (నిర్మాణము) (Construction)

,, Proposition = ఉపన్యస్తవాక్యము.

,, Reasoning = ఉపన్యస్తతర్కము.

,, Hysteria = అపతంత్రకము; గర్భాశయోన్మాదము.

# I

Ibex = కొండగొఱ్ఱె.

Iceberg = హిమరాశి; హిమపర్వతము.

Ice floes = హిమఖండములు.

Ichor = రసి; కురుపురసి.

Ideation = ప్రత్యయనము; అవధారణము.

Identical = అభిన్న; ఐక్య.

Indentity = అభిన్నత; ఐక్యత; తాదాత్మ్యము; సరూపత.

Igneous rocks = అగ్నిజశిలలు.

Ignition = దహించుట; నిప్పు అంటుకొనుట.

Ignoratio Elenchus = అవిద్యాకల్పిత నిరాకరణము; విపర్యయ పర్యవసానము.

Iguana = ఉడుము.

Ilium = తుంటి ఎముక; కటికపాలము.

Illative = హేతుద్యోతకము.

Illicit process = అక్రమము.

,, ,, of major = సాధ్యదోషము.

Illogical = కుతర్కకరమైన; అతార్కికమైన.

Illuminating power = దీపనశక్తి.

Illusion = ఆరోపము; భ్రాంతి; భ్రమ.

Image = ప్రతిబింబము; ప్రతిరూపము.

Image worship = ప్రతిమాపూజ; మూర్తిపూజ.

Imaginary = భావ్య; మనఃకల్పిత; కాల్పనిక.

Imbricate = పెనవేయుట; అల్లుకొనుట.

Imitation diamond = మాయావజ్రము.

Immediate inference = విస్పష్టానుమానము.

Immunity = (రోగ) నిర్భయత; రాహిత్యము; విముక్తత.

Impenetrability = అభేద్యత.

Impennous = రెక్కలులేని; పక్షవిహీన.

Imporous = రంధ్రములులేని.

Impotency = నపుంసకత్వము.

Incandescent = జ్వలీకృత; మండెడు; అత్యుష్ణ.

In-circum-centre = అంతర్వృత్తకేంద్రము; అంతఃకేంద్రము.

Incisors = కత్తెరపండ్లు; కొరుకుపండ్లు.

Inclination = ఒఱగియుండుట; వాలుట.

Incommensurable = అననుపరిమేయ; అపరిచ్ఛేదశీల.

Incompressibility = దుస్సంకోచ్యత; అసంకోచ్యత.

Inconsistent = అసంగతమైన; పరస్పర విరుద్ధమైన.

Incubation period = పొదిగెడుకాలము; అంతర్గతస్థితి; రోగోద్భూత కాలము.

Inous = దాశలి రొమ్ముక.

Indehiscent fruit = కఠిన ఫలము.

Independent = స్వతంత్ర; స్వాధీన.

Indestructibility of matter = పదార్థసత్వము.

Indeterminate = అవినిర్ణేయ; నిర్ణయింపశక్యముగాని.

Index = ఘాతసూచి; ఘాతమాపకము; ఘాతాంశము,

Index of a power = ఘాతముయొక్క; ఘాతరూపకము; ఘాతాంకము.

Index of a root = మూలముయొక్క; ఘాతరూపకము: ఘాతాంకము.

India Rubber = ఇండియా రబ్బరు; సందర్షిణి.

Indian aconite = నాభి.

,, aloe = కలబంద.

,, Beech = కానుగ.

,, Birth wort = ఈశ్వరవేరు.

,, Butter tree = ఇప్పచెట్టు.

,, Coral ,, = పారిజాతము.

,, Gum arabic = తుమ్మ;

,, Hemp = గంజాయి.

,, Jalap = తెగడ.

Indian kino = వేగిస.

,, Lilac = తురకవేప.

,, Mulberry = తూతిక; మద్ది.

,, Olibarunum = పరంగి సాంబ్రాణి.

,, Penny wort = బ్రాహ్మి.

,, Sorrel = పులిచింత.

,, Spinnach = బచ్చలి.

Indigestion = అజీర్ణరోగము.

Indigo = నీలిమందు.

Indirect = అపరోక్ష.

Indium = ఐందము (ర).

Individual terms = ఏకవ్యక్తివాచకము.

Induced current = ప్రేరేపితవిద్యుత్ప్రవాహము.

Induction = ప్రతిస్థాపనము; విశేషపరీక్షాపూర్వక సాధారణానుమానము; ఉదాహరణానుమితసిద్ధాంతము.

Inequality = అసమత్వము; వైషమ్యము.
Inertia = జడిమ; జడత్వము.
Inesse (in actual existence) = వస్తుతః.
In-extenso (At full length) = విస్తారముగా; విస్తరముగ.
Infection = సోకుడు; అంటు (వ్యాధి); సంసర్గదోషము.
Inference = అనుమానము; తర్కము; యుక్తి;
Inferior Vena Carva = అధోబృహత్సిర.
Infinite = అపరిమిత; అనంతర.
Infinity = అనంతము; అనంతరాశి; కహారము.
Inflammable = దహనశీలమైన.
Inflammation = వాపు; కంచుట; నొప్పి, మంటతోగూడినవాపు; శోఫ; దాహము.
Inflammation of the gums = పండ్లచిగుళ్లవాపు.
Inflator = వాతకుంభకము.
Inflexible = వంగని; పెళుసైన.
Inflorescence = పూత; పుష్పగుచ్ఛము.
Influenza = ఇన్ఫ్లూయెంజా ; దుష్టప్రతిశ్యాయ జ్వరము; విషశైత్య జ్వరము.
Infundibulum = వాయుగొట్టము చివరనుండుగోళము.
Injection = ఇంజెక్షను; రక్తనాళములోనికి మందు పిచికారీచేయుట.
Inoculation = ఇనాక్యులేషను; రక్తనాళములోనికి రోగప్రతిబంధకరసము నెక్కించుట.
Inodorous = నిర్గంధ; వాసనలేని.
Inorganic = జడ; అచేతన; నిర్జీవ.
Inorganic rocks; = నిర్జీవశిలలు.
Insanity = పిచ్చి; వెఱ్ఱి; ఉన్మాదము.

**Inscribe** = అంతస్పర్శము; అంతర్గతము గావించు; ఇముడు; అంతర్లంబించు.

**Insect** = క్రిమి; కీటకము; పురుగు.

**Insecticide** = క్రిమిఘ్నము.

**Insipid** = చప్పని; రుచిలేని.

**Insomnia** = నిద్రా మి రోగము.

**Inspiration** = ఉచ్ఛ్వాసము; ఊపిరి లోనికి పీల్చుకొనుట.

**Instance** = అంశము.

**Instrument** = పనిముట్టు; ఉపకరణము.

**Insular** = ద్వీపసంబంధము; జలావృతము.

**Insulator** = విద్యుద్బంధని.

**Insulation** = విద్యుద్బంధనము.

**Insurance** = భీమా.

**Integer** = పూర్ణాంకము; పూర్ణసంఖ్య; రూపము.

**Integral** = పూర్ణాంకముగల; పూర్ణాంకిక.

**Integrant of parts** = పూరక.

**Integument** = అవరణపొర; అండత్వక్కు.

**Intension** = గాంభీర్యత.

**Intensity** = తైక్ష్ణత.

**Intercellular Spaces** = కణాంతరావకాశములు.

**Intercept** = అడ్డగించు; అంతర్వర్తిని.

**Interdependent** = అన్యోన్యాశ్రయములు.

**Interest** = వడ్డీ; వృద్ధి.

" Compound = వడ్డికివడ్డి; చక్రవృద్ధి.

" Simple = బారువడ్డీ; అసలుకు వడ్డి.

**Intermediate nitrate** = మధ్యతరగతి నత్రితము.

Intermittent = అంతరిత; మధ్యమధ్య ఆగిఆగి.

,, Fever = ఆగిఆగివచ్చు విషజ్వరము.

Internal forces = అంతశ్శక్తులు.

,, reflection = అంతర్ప్రతిబింబకరణము.

Internode = స్కంధము; గ్రంధిమధ్యము.

Interpolation = అంతరనిక్షేపము; ప్రక్షేపము.

,, method = అధ్యాహారపద్ధతి.

Interrogation mark = ప్రశ్నార్థక చిహ్నము.

Intersect = ఖండించు.

Intersection = ఖండన.

Interstitial cells = నడిమి కణములు.

Interstitial growth = నడిమివృద్ధి; పెంపు.

Interval = అంతరాయము.

Intestinal juice = అంత్రరసము.

Intestines = ప్రేగులు; ప్రేవులు; అంత్రములు.

Intestine, Large = పెద్దప్రేగు; బృహదంత్రము.

,, Small = చిన్నప్రేగు; క్షుద్రాంత్రము.

Intestinal obstruction = బద్ధాంత్రోదరము.

Intimate relation = సమవాయి.

In toto = పూర్ణముగా.

Intoxicant = మైకము కలిగించునది. మత్తుపదార్థము.

Intracellular digestion = కణాంతర్గత జీర్ణము.

Intrastelar = స్తంభాంతర్గత.

Intrinsic = సహజ; స్వీయ; తన.

Intuition = సహజజ్ఞానము; అంతర్జ్ఞానము; ప్రమాణనిరపేక్షజ్ఞానము.

**Intus-susception, growth by** = అంతర్వృద్ధి.

**Invariable** = మారని.

**Invention** = అపూర్వ కల్పన.

**Inversion** = వ్యస్తవిధి; విలోమవిధి; విపర్యాసస్థ.

**Inverse ratio** = విలోమ నిష్పత్తి; విలోమ సంబంధము.

„ **Square** = విలోమవర్గము.

**Invert** = త్రిప్పు; తలక్రిందు చేయు.

**Investigation** = పరీక్ష.

**Invisible rays** = అదృశ్యకిరణములు.

**Involution** = ఘాతమును కనిపెట్టు క్రియ: (2) మెలి; తిరుగుడు; మడత

**Involuntary muscles** = స్వతంత్ర కండరములు.

**Invoice** = జాబితా; పట్టీ.

**Iodine** = అయోడిను; అదము (ర)

**Ions** = అయములు.

**Ionization** = అయోకరణము.

**Iridium** = ఐంద్రము (ర).

**Iris** = కనినిళా పటలము; కనుపాపచుట్టునుండు మండలము; తారామండలము.

**Iritis** = కను గ్రుడ్డువాపు.

**Iron, Cast** = పోతయినుము.

„ **Wrought** = వంట యినుము.

„ **Pyrites** = తారమాక్షికము; లోహాగంధకిదము.

„ **Stills** = లోహపు ఘటములు.

„ **Sulphate** = అన్నభేది.

**Irrational** = కరణిగత; సరియైన మూలములేని; యుక్తివిరుద్ధము.

Irregular = అపక్రమ; అసమ; విషమ; అనియత.

Irresolvable = అభాజ్య; లబ్ధమూలములుండని; అవిశ్లిష్య.

Irrelevant Conclusion = అప్రస్తుత ఉపసంహారము; అప్రసంగిక ఉపసంహారము

Irritant = తాపజనకము; ఉత్తేజకము; మంటను నొప్పిని కలిగించునది.

Irritability = రేగుట; ఉత్తేజన; క్షోభ.

Isthmus = భూసంధి; రెండు భూభాగములను కలియు నడిమిప్రదేశము.

Isobars = సమభార రేఖలు.

Isoceles = సమద్విభుజమైన.

Isochronism = సమకాలికత్వము.

Isohel = సమసూర్యరశ్మి రేఖ.

Isohyetose = సమవర్ష పాత రేఖలు.

Isolation = సంపర్కరాహిత్యము; ప్రత్యేకించుట; వేరుచేయుట.

Isopermetrical = ఒకేచుట్టుకొలత గల.

Isonephs = సమమేఘావృత రేఖలు.

Isotherms = సమోష్ణరేఖలు.

Italian millet = కొర్రలు.

Itch = గజ్జి; చిడుము.

# J

Jack = జాకీ; ఇరుసు ఖడ్డీని చక్రమునను పైకెత్తు సాధనము (2) పనసచెట్టు.

Jackquinie = పాకుడు.

Jalap, Indian = తెగడ.

Jasper = సూర్యకాంతి; పచ్చరాయి.

Jaundice = పసిరికలు (కామెరలు); కామిలారోగము; పాండురోగము.

Jaw = దవుడ; దౌడ.

Jejunum = మధ్యాంత్రికము; చిన్నపేగుయొక్క రెండవ భాగము.

Jelly = జెల్లిక.

Jelly fish = సిటికాయ.

Jequiriety = గురిగింజ.

Jews-harp = మోర్చింగు వాద్యము; మోర్సింగు.

Joint or Articulation = సంధి; కీలు.

Joint, Acromio Clavicular = అక్షకాంసఫలక సంధి.

,, Ankle = గుల్ఫ సంధి.

,, Arthrodia = ప్రితర సంధి.

,, Atlantic-Axial = చూడావలయ దంతచూడ సంధి.

,, Ball and Socket = ఉదూఖల సంధి; ఉఖలాముసలక సంధి.

,, Carpal = కరకూర్చాన్తరీయ సంధి.

,, Carpo Metacarpal = కరతల సంధి.

,, Condyloid (articulation) = ఖల్లకోర సంధి.

,, Costo vertebral = పరశుకాపృష్ఠకశేరుక సంధి.

,, Cranio Vertebral = శిరోగ్రీవ సంధి.

,, Elbow = కూర్పర సంధి.

,, Enarthrosis (Ball and Socket) = ఉదూఖల సంధి.

,, Ginglymus (Hinge like) = సందంశకోర సంధి.

,, Gomphosis (peg and nail) = దశనోదూఖల సంధి.

,, Hip = శ్రోణిసంధి.

,, Metatarsal = పాదతల సంధి.

,, Occipito-Atlantal = పశ్చిమకపాల చూడావలయ సంధి.

Joint Occipito-Axial = పశ్చిమకపాల దంతచూడా సంధి.
,, Phalangeal = కరాంగుళీ సంధి.
,, Radio ulnar = ప్రకోష్ఠాన్తరీయసంధి,
,, Reciprocal reception (Saddle Joint)=పరస్పరకోర సంధి.
,, Schindylesis = గ్రస్తసీవని సంధి.
,, Shoulder = అంససంధి.
,, Sturno Clavicular = అక్షకోరఃసంధి.
,, Tarsal = పాదకూర్చాన్తరీయ సంధి.
,, Temporo Mandibular = హనుముండ సంధి.
,, Tibio Fibular = జంఘాను జంఘాస్థి సంధి.
,, Trachoides (Pivot) = చక్రకోర సంధి.

Judaism = యూదీయమతము.

Jugular Vein = కంఠసిర; మెడప్రక్కనుండు పెద్దసిర.

Julep = పానకము; కషాయము.

Jupiter = బృహస్పతి; గురుడు.

Jute = జనుపనార.

Juxtaposition = సాన్నిధ్యము; సంస్థితి.

## K

Kala-azar = కాలజార్; విషపాండుజ్వరము.

Kaleidoscope = చిత్రదర్శిని; చిత్రరూపదర్శిని.

Katabolism = అపచయక్రియ; ప్రతిలోమపృథక్కరణము; ప్రతిలోమ రూపభేదము.

Keck = వమనముచేయుట; డోకుట.

Keel = నౌతలము; ద్రోణీదళము; ఓడక్రింది దూలము.

Kelp = సముద్రపుపాచి.

Kernal = గింజ; విత్తు; పప్పు; గుంజు: గుజారు.

Kibe = విపాదిక; చలివల్ల చర్మముపగులుట.

Kidneys = మూత్రపిండములు; మూత్రాశయము; ఉలవకాయలు; పక్కరగుండెలు; వృక్కలు; మూత్రముచేకూర్చుటకు ఉదరములోనున్న మాంస గ్రంధులు.

Kilogram = కిలోగ్రాము; వెయ్యిగ్రాములఎత్తు.

Kilometre = కిలోమీటరు; సహస్రమీటరు.

Kinetic = గతిజన్య.

Kinetic theory of heat = గతికల్పితఉష్ణము.

King of metals = ధాతురాజము.

King's metal = గండమాలారోగము.

Kino-tree, Indian = వేగి; వేగిస; ఏగిసచెట్టు.

Kleptomania = చౌర్యరుచి; దొంగబుద్ధి.

Knee cap (Knee-pan) = మోకాటిచిప్పఎముక; జాను ఫలకము.

Knock-kneed = గాడిదెకాళ్లు; ముట్టికాళ్లు; లోపలికివంగిన మోకాళ్లుగల.

Knowledge = జ్ఞానము; విద్య.

Knuckle = వ్రేలికణుపు; అంగుళీపర్వము.

Koniscope = గాలిలోని ధూళినిగొలుచుయంత్రము.

Krypton = క్రిప్తము (ర)

## L

Laviate = దళవృత్త.

Laboratory = ప్రయోగశాల; రసాయన సంస్కారశాల.

Lacerated wound = విదారణక్షతము; చీలుకొనిపోయిన గాయము.

Lacrymal glands = బాష్పజల గ్రంధులు.

Lactation = స్తన్యోత్పాదనము.

Lactation fever = చనుబాల జ్వరము.

Lacteals = ధాతు ఉపవాహికలు; క్షీరవాహికలు; బిసనాళములు; పాల గొట్టములు; పయస్స్విన్యములు.

Lactic acid = క్షీరామ్లము; అమ్లక్షీర రసము.

Lactometer = దుగ్ధమాపకము

Lagoon = లోతులేని సముద్రశాఖ; మడుగు.

Lake = సరస్సు, చెరువు.

Lamp black = దీపపుమసి; దీపాంగారము.

Land breeze = భూమారుతము.

Lanset = నస్తర; శస్త్రాయుధము; అధ్యర్ధాధారశస్త్రము.

Land slip = భూపాతము; భూపతనము.

Lanthanum = లంధనము (ర).

Large intestine = స్థూలాంత్రము; పెద్దపేగు.

Larva = క్రిమిదశ. కోశాంతర్గతకీటము.

Larvae = లార్వే; దేహనిర్మాణమున తల్లిని బోలక స్వేచ్ఛావిహారము చేయు పిల్ల; అప్పుడే గ్రుడ్డులోనుండి వచ్చిన పిల్ల; కీటస్థితి.

Laryngitis = స్వరపేటిక వాపు; స్వరస్రోత్రదాహము.

Larynx = స్వరపేటిక; స్వరయంత్రము; గొంతుక్రోవి.

Last term = అంత్యధనము.

Latent heat = గూఢోష్ణము; అంతర్గతోష్ణము.

Lateral pressure = పార్శ్వపీడన.

Lateral Surface = ప్రక్క-చోటు, పార్శ్వపరిభాగము.

**Latex** = దుగ్ధరసము.

**Lathe** = లేతు; తరుకొణయంత్రము; తతిణిపట్టు సాధనము.

**Latitude** = అక్షాంశ రేఖ.

" of a planet = గ్రహాపతనము.

**Latrines** = మరుగుదొడ్లు; పాయిఖానాలు.

**Laudanum** = అభిని; నల్లమందు ద్రావకము.

**Lava** = అగ్నిపర్వతద్రవము; శిలాద్రవము.

**Law** = సిద్ధాంతము.

**Laws of thought** = ఆలోచన సూత్రములు.

**Lead acetute** = సీసాశితము.

" Carbonate = సీసకర్బనితము.

" red = గంగసిందూరము.

" Stone = సిందూరము.

" wort = చిత్రమూలము.

**Leaf** = ఆకు; పత్రము.

**Leaf base** = పత్రపీఠము.

**Leaflet** = చిన్నఆకు; చిరుతయాకు.

**Leaf mosaic** = పత్రపటికము.

**Leap year** = లీపువత్సరము; దీర్ఘవత్సరము; 366 రోజాలు.

L. C. M. (Least Common Measure) = కనిష్ఠసామాన్యగుణిజము; లఘుతమ సామాన్య అపవర్తకము.

**Legal fiction** = వ్యంగ్యపూరక కల్పన.

**Legume** = ద్వివిదారుణఫలము; కాయధాన్యము.

**Leguminosae** = చిక్కుడు కుటుంబము.

**Lemma** = అవలంబనము.

**Lemon** = నిమ్మ.

**Lens** = గాజుబిళ్ళ; కటకము; బింబము.

**Leo** = సింహము.

**Leonis** = పూర్వఫల్గుని; ఉత్తరఫల్గుని.

,, **Regulus** = మఘ.

**Leprosy** = కుష్ఠరోగము.

,, **bacillus** = కుష్ఠరోగ సూక్ష్మదండిక.

**Lepus** = శశము.

**'Let the number be one'** (false assumption) = ఇష్టకర్మము.

**Leucocites** = శోషకరసకణములు; శ్వేతరసకణములు.

**Leucoderma** = బొల్లి; శ్వేతకుష్ఠము.

**Leucorma** = కంటిలోని పొర.

**Leucorrhoea** = శ్వేతప్రదర; తెలుపు అగుట.

**Level** = మట్టము.

**Lever** = లివరు; తులాదండము; తోలదండము; మీట.

**Levigation** = దేవుట; మెత్తనిపొడి చేయుట.

**Leyden jar** = లేడెన్ గిన్నె.

**Libra** = విశాఖ; తుల (రాశి).

**Lift** = లేవనెత్తు యంత్రము.

**Ligament** = సంధిబంధనము; స్నాయువు.

**Light** = ప్రకాశము; వెలుతురు.

**Light house** = దీపస్తంభము.

**Lightning stroke** = పిడుగుపాతము; మెరుపువలని దెబ్బ.

**Lignum** = మ్రానిచేవ.

**Ligule** = తృణపుచ్ఛము.

Like = సమాన.

Like term = సమరాశి.

Lime = సున్నము; ఖటికామ్లజిదము.

Lime stone = సున్నపు రాయి.

" water = సున్నపు తేట.

Limit = హద్దు; మేర.

Limitative = అవచ్ఛేదక, వ్యవచ్ఛేద.

Limit, Superior = పైహద్దు.

Limit of perfect recovery = స్థితిస్థాపకత్వమర్యాద.

Limonite = లిమ్నాయసము (ర)

Line of vision = దర్శనరేఖ.

Linear = దీర్ఘాకృతి; నిడుపైన.

" Expansion = ఏకదిశావ్యాకోచము.

Liniment = మర్దనౌషధము; లేపనము; తైలము.

Lingual nerve = జిహ్వానాడి.

Linguistic Science = భాషాశాస్త్రము.

Linseed = అవిసె.

Lint = దూది.

Liquids = ద్రవములు.

Liquid storax = శిలారసము.

Liquification = ద్రవీకరణము.

Liquorice = అతిమధురము.

Litharge = పచ్చసీసము.

Lithium = గ్రావము (ర).

Litmus = లిట్మసు కాగితము; (నీలి; ఎరుపు.)

Litre = లీటరు ఫ్రెంచి కొలత 1.76 ఇంగ్లీషు పైంట్లు.
List = జాబితా; పట్టీ.
Liver = కాలేయము; యకృత్తు; నురుగుడబ్బ; కార్జము.
Liver abscess = కారిజపు పుండు; యకృద్దాహము; యకృద్గుల్మము.
Liver enlargement = యకృద్ధాల్యోదరము.
Living = సజీవ.
Lobe = వృత్తము.
Lock = లాకు; ప్రవాహబంధము; తాలుకలలాకులు.
Lock-Jaw = అంకెళ్లు పట్టుకొనిపోవుట; నక్కిళ్లుపట్టుట; హనుస్తంభము.
Locomotion = చలనము; గమనము; గమనశక్తి.
Locus = నిధానము; బిందుపథము; జాడ.
Locust pest = మిడుతలదండు; కీటకబాధ.
Lodicule = పుంకేసరబాహ్యవల్కము; ఉన్మదప్రకము.
Logarithm = సంవర్గమానము; ఘాతాంకగణన.
Logic = తర్కము.
Logical = తార్కిక; న్యాయమైన.
,, abacus = న్యాయపట్టిక.
,, argument = రుజు అనుమానము.
,, Chain of argument = శృంఖలానుమానము.
,, philosophy = న్యాయదర్శనము.
Logwood = తొగరు చెక్క.
Longitude = మధ్యాహ్నరేఖ; రేఖాంశవృత్తము; రేఖాంశము.
,, of heavenly bodies = రాహగము.

Longitudinal dehiscence = అను దైర్ఘ్యవిదళన.

" Section = అను దైర్ఘ్యవిచ్ఛేదనము.

Long sight = చత్వారము.

Loop = పాశబంధము; కొలి; వంపు.

Lotion = ధావనౌషధము; కడుగుట కుపయోగించుమందు.

Lower fixed point = అల్పతర స్థిరస్థానము.

Lower jaw bone = క్రింది దవుడ ఎముక.

Low power = హీనశక్తి; తగ్గుదృచ్ఛక్తి.

Low pressure = లఘు పీడనము.

Low tide = లఘుజ్వార భాట; తగ్గుపోటు.

Low water = తగ్గుపాటు నీటిమట్టము.

Lubricant = కందెన; నున్నగచేయునది; స్నిగ్ధీకరణ సాధనము.

Lumbago = కటివాతము; నడుముశూల.

Lumbar vertibrae = నడ్డిపూసలు; కటిమణి.

Luminous = స్వయంప్రకాశ, ప్రకాశమగు.

Lunar month = చాంద్రమాసము.

Lunar year = చాంద్ర వర్షము.

Lungs = శ్వాసకోశములు; శ్వాసాశయములు; పుప్ఫుసములు; ఊపిరి తిత్తులు

Lupus = వృకము; వృకవికార రోగము; ముక్కు చర్మము తినివేయు జబ్బు.

Lymph = శోషరసము; లసీకా; శుభ్రధాతువు; శ్వేతధాతువు; ఉదక ధాతువు; జీవజంతువుల శరీరములందుండు రక్తమువంటి ద్రవము.

Lymphatics = శోషవాహికలు; రసవాహికలు.

Lymphatic gland = శోషరసగ్రంధి; అవికావాహక గ్రంధి; ఓషకరస గ్రంధి.

Lynx = గవయము.

Lyri = అభిజిత్.

Mace = జాపత్రి.

Machine = యంత్రము.

Macrobiote = చిరజీవి.

Macrocephalic = దీర్ఘశిర (ముగల).

Macrodactyl = పొడవగు కాలివ్రేళ్ళుగల.

Malabar nut = అడ్డసరము.

Magic Lantern = యక్షిణీ దీపము.

Magnesia = మగ్నామ్ల జిదము.

Magnesium = మగ్నము (ర).

Magnesium sulphate = మగ్నగంధకితము.

Magnet = స్కాంతము; అయస్కాంతము; సూదంటురాయి; చుంబకము; లోహచుంబకము; లోహాకర్షకము.

,, artificial = కృత్రిమలోహచుంబకము.

,, Polarity of a = చుంబకత్వములోని దక్షిణోత్తరాభిముఖత.

Magnetic = చుంబక; చుంబకీయ; ఆకర్షక.

,, Attraction = చుంబనాకర్షణ; లోహాకర్షణ.

,, Battery = చుంబకమాల.

,, Curve = చుంబకవక్రము.

,, Declination = అయస్కాంత క్షీణత.

**Magnetic Dip; Inclination** = చుంబకీయనతాచీపతనము.

,, **Elements** = చుంబకీయమూలతత్త్వములు.

,, **Equator** = చుంబనవిషువద్వృత్తము.

,, **Field** = చుంబకబలక్షేత్రము; కాంతప్రదేశము.

,, **Fluid** = చుంబనద్రవము.

,, **Induction** = చుంబకప్రవర్తన.

,, **Meridian** = చుంబనభూమధ్యవృత్తము.

,, **Needle** = చుంబకపుసూది.

,, **Polar** = చుంబకధ్రువములు.

,, **Saturation** = చుంబకీయసంపృక్తత.

,, **Separation** = చుంబక వియోగము.

**Magnetization** = స్కాంతీకరణము.

**Magnetite** = స్కాంతాయితము.

**Magnetism** = లోహచుంబకత్వము;

**Magneto** = విద్యుత్ జనకచుంబక యంత్రము.

**Magnifying power** = (బింబ) విస్తరణశక్తి.

**Magnitude** = కొలత పరిమాణము.

**Maize** = మొక్కజొన్న.

**Major axis** = దీర్ఘాక్షము; బృహదక్షము.

**Major premises** = గుర్వవయవము.

,, **Term** = గురుపదము; వ్యాపకము.

**Malar bone** = గండాస్థి.

**Malaria** = మన్నెపు జ్వరము; చలి జ్వరము.

**Malleability** = విస్తార్యత, సాగెడు గుణము.

**Mallet** = కొయ్యగూటము; సుత్తి; సమ్మెట.

Malleus = సుత్తిఎముక.
Mammal = క్షీరదము; పాలిచ్చు జంతువు.
Mammalia = స్తనపాయులు; పిల్లలకు పాలిచ్చిపెంచు జంతువర్గము.
Mammary glands = క్షీరరస గ్రంధులు.
Mandible = చిబుకాస్థి; హన్వాస్థి
Manganese = మాంగనము (ర)
Mania = ఉన్మాదము.
Mantissa = అపూర్ణభాగము; (సంవర్గమానములోని).
Manure = ఎరువు.
Marble = చలువరాయి.
Margosa = వేప.
Marigold = బంతి.
Mariner's Compass = నావికాదిక్సూచి.
Marjoram = మరువము.
Marrow = మూలుగ; ఎముకసారం. (2) దవ్వ.
Mars = అంగారకుడు.
Marsh gass = పంకవాయువు.
Marsh mint = పుదీనా.
Marsh plant = పంక వృక్షము.
Marsuapial = తిత్తిలో బిడ్డలను పెంచు జంతువులు.
Martynia = తేలుకొండికాయ.
Mass = రాశి; ద్రవ్యరాశి.
Massage = ఒళ్లుపట్టుట; తోముట.
Mastication = నములుట; చర్వణము.

**Masturbation** = ముష్టిమైథునము.

**Mastitis** = స్తనశోఫ.

**Matches** = నిప్పుపుల్లలు.

,, Safety = నిర్భయపు అగ్గిపుల్లలు.

**Maternity** = ప్రసూతి; ప్రసూతి వైద్యము.

**Mathematics** = గణితశాస్త్రము; గణితము.

,, Abstract or Pure = శుద్ధగణితము.

,, Applied or Mixed = మిశ్రగణితము.

**Mathematical; Mathematically** = గణితశాస్త్రానుసార; గణితానుసార.

**Mathematics, Catenary** = (దురాకృతి); కాతన్వలి గణితము.

,, Cycloid = చక్రాభాస ,,

,, Envelope = అన్వాలేప; అచ్ఛాదక ,,

,, Epicycloid = అపచక్రాలద ,,

,, Harmonic = హారాత్మక ,,

,, Hyperbola = అతిపరవలయ ,,

,, Hypocycloid = అతిచక్రాలద ,,

,, Hypotrochoid = అతిత్రిచ్ఛేద ,,

,, Lemniscate = ఇలామాల ,,

,, Parabola = పరవలయ ,,

,, Radical = కరణి ,,

**Matter** = పదార్థము; జడము.

**Mattock** = కుద్దలి; తొల్లిక; (Pickaxe).

**Maw-worm** = నులి పురుగు.

**Maximum** = అత్యుచ్ఛ్రాయదశ; మహత్తరము; ఉచ్చము.

Maximum = గరిష్ఠము; పరమము

Mean = మధ్యమము; సగటు.

Mean Circum-centre = ఘనమధ్యము.

,, Distance = మధ్యమాంతరము.

,, Position = విశ్రాంతిస్థానము.

Mean Solar day = మధ్యమసౌరదినము.

Measles = చిన్న అమ్మవారు; తట్టు; పొంగు: రోమాంతిక.

Measure = కొలత; కొలబద్ద; మానము; ప్రమాణము; భాజకము; అపవర్తకము; సామాన్యాపవర్తకము.

,, Common = సామాన్య ప్రమాణము.

,, Greatest common (G. C. M.) = గరిష్ఠ సామాన్యప్రమాణము.

,, Linear = దైర్ఘ్యమానము.

,, of capacity = ద్రవమానము.

,, of weight = భారమానము.

,, Square = భూఫలమానము; వర్గమానము.

,, Cubic = ఘనమానము.

Measurement of length = పొడవుకొలత.

,, of surface = చతురపుకొలత.

Mechanical mixture = సామాన్యమిశ్రణము; శుద్ధమిశ్రణము.

Mechanics = యంత్రగతి శాస్త్రము; యంత్రనిర్మాణ శాస్త్రము; యంత్రవిద్య.

Median = మధ్యస్థరేఖ; మధ్యగత.

Medium = యానము; యాననము.

Medulla = దవ్వ; దూట.

Medulla oblongata = మజ్జాముఖము; సుషుమ్నా శీర్షకము.

Medullary rays = దూటరేఖలు; దవ్వసంబంధమైన కిరణములు.

Mega-cephalus = పెద్దకపాలముగల.

Megagamete = స్థూలసంయోగి.

Mega-nucleus = స్థూల జీవస్థానము.

Mega spore = స్థూల బీజము.

Melody = శ్రావ్యగుణము.

Melon = కర్బూజా.

Melting point = కరుగు వేడిమి.

Membrane = కలా; కళ; పొర; త్వచ; ఆవరణత్వచము; అంతరావరణ త్వక్కు; వేష్టనము; ఆవరణత్వక్కు; అంతస్త్వక్కు.

" Adventitious = ఆగంతుకత్వచము.

" Fibrous = తాంతవత్వచము.

" Mucous = శ్లేష్మత్వచము.

" Serous = రక్తజలత్వచము.

Membraneous = మృదు; ఆవరణత్వఙ్మయము.

Menses (Menstruation) = ముట్టు; అంటు; ఋతుస్రావము.

Mensuration = క్షేత్రమితి; కొలత శాస్త్రము.

Meningitis = మస్తిష్కవేష్టన దాహరోగము.

Menopause = రజోనివృత్తి; వార్ధక్యమున ఋతుస్రావము నిలుచుట.

Menorrhagia = అత్యార్తవము; అత్యధిక ఋతుస్రావము.

Menstrual Disorders = ఋతుస్రావ వ్యాధులు.

Mercury = పాదరసము (2) బుధుడు.

Mercuric Chloride = భాండమన కర్పూరము.

Mercuric Oxide = పారదామ్ల జనిదము.

Mercurous Chloride = రసకర్పూరము.

Mercuric Sulphur = కజ్జలి.
Mercury Sulphide ఇంగిలీకము.
Meridian = మధ్యాహ్న రేఖ.
Meridian circle = యామ్యోత్తర రేఖ,
Meristem cells = విభాజ్యకణములు.
Mesentery = అంతర్బంధని; అంత్రిక.
Mesocarp = గుజ్జు.
Mesophytes = సాధారణ వృక్షములు.
Metabolism = చయాపచయక్రియ.
Meta carpals = కరాంగుళ్యాధారాస్థులు; పాణికములు.
Meta carpus = కరాంగుళ్యాధారాస్థి.
Metal = ధాతువు.
Metallurgy = ధాతుశాస్త్రము.
Meta morphosis = రూపభేదము.
Meta phosphoric acid = మితస్ఫురికామ్లము.
Metaphysical science = అధ్యాత్మిక శాస్త్రము.
Metatarsus; Metatarsals = పాదాంగుళ్యాధారాస్థులు.
Meteorology=అంతరిక్షశాస్త్రము; పవనస్థితిశాస్త్రము; వాతావరణశాస్త్రము
Meteors = ఉల్కలు.
Method = విధి; మార్గము; పద్ధతి.
,, analytical = అన్వయవిధి; విభజనమార్గము.
,, of argument = అభ్యుపగమ పద్ధతి; కేవలాన్వయపద్ధతి.
,, of difference = విసంవాద పద్ధతి; కేవల వ్యతిరేకపద్ధతి.
,, of exclusions = అన్వయవ్యతిరేక పద్ధతి.
,, of substitution = ప్రత్యామ్నాయ పద్ధతి.

Meter; Metre = మీటరు; మాపకము.

Metric system = మీటరు మానము.

Mexican poppy = బ్రహ్మదండి; బలురక్కెస.

Mica = అభ్రకము.

Micro coccus = సూక్ష్మగుటిక.

Microcosm = సూక్ష్మ ప్రపంచము.

Micrometre = సూక్ష్మదైర్ఘ్యమాన యంత్రము.

Micro nucleus = సూక్ష్మజీవస్థానము.

Micro organisms = సూక్ష్మసంయోగి; సూక్ష్మజీవులు.

Micro phyle = సూక్ష్మరంధ్రము; అణుద్వారము.

Microscope = సూక్ష్మదర్శిని.

Microspore = సూక్ష్మబీజము; మగబీజము.

Middle ear = మధ్యకర్ణము; నడిమిచెవి.

Middle term = మధ్యధనము; మధ్యపదము; వ్యాప్యము; హేతువు(తర్క-)

Midge = సన్నదోమ; కాటమెరపురుగు.

Migration = వలస; నిర్గమనము.

Mild alkali = సజ్జలక్షారము.

Mildew = బూజా.

Milk hedge = జెముడు చెట్టు.

Milky way = ఆకాశగంగ.

Milk supply = పాల సరఫరా.

Milk teeth = పాలపండ్లు.

Millet = జొన్నలు, (ఒక రకము.)

Millimetre = సహస్రాంశమీటరు.

Million = పది లక్షలు.

Mineral matter = లోహపదార్థము; ఖనిజపదార్థము.

Minerology = ఖనిజ శాస్త్రము.

Mining = గనులు త్రవ్వుట.

Minim = మినిము; ద్రవపదార్థపు చుక్క లేక బొట్టు; డ్రాములో 1/60 వంతు (2) సిందూరము.

Minimum = కనిష్ఠము; కనిష్ఠము; నీచము; న్యూనతమము; అధమము.

Minor Axis = లఘ్వక్షము.

,, Premises = లఘ్వవయవము (తర్క-).

,, Term = లఘుపదము. పక్షము.

Minuend = తీర్పుడు (తీసివేత) లో పైసంఖ్య.

Minus = ఋణము; తగ్గిన; తీసివేత.

,, Sign = ఋణసంజ్ఞ; తగ్గించుసంజ్ఞ.

Minute = మినిటు; కల; లిప్త; నిముషము.

Mirage = ఎండమావులు.

Miscarriage = గర్భపాతము.

Mist = మంచు; తుషారము.

Mite = తవుటి పురుగు.

Mitral Valves = కిరీట పిధానములు.

Mixture = మిశ్రితౌషధము; సమ్మిశ్రణము; సంయోజనము.

Mnemonic lines = స్ఫోరక వాక్యములు.

Mobility = పారుదల; చంచలత.

Model = ప్రతిరూపము; వస్తునమూనా; మేల్బంతి.

Modus Tollens = నిషేధావస్థ.

Molars = విసరుపండ్లు; నములుపండ్లు; ప్రక్కపండ్లు.

Molasses = బెల్లపుపిరు.

Molecule = అణువు; కణము; రజము.

Molecular = అణుసంబంధము; అణుజన్య; అణుమయ.

,, Attraction = అణ్వాకర్షణ.

Molecularity = అణుజన్యత.

Moleculism = అణుత్వము,

(పరమాణువు = Atom, అణువు = Molecule. అణీయ = Electron.)

Mollusc = గుల్లజంతువు.

Mollusca = మృదుశరీరజంతుములు.

Molybdenum = మాలదము, (ర).

Momentum = ఊరవడి; గతిబలము.

Monadelphous = ఏకబంధ.

Monochasial helicoid = శంఖునకమధ్యారంభమంజరి.

,, Scorpiod = వృశ్చికమధ్యారంభమంజరి.

Mono Cotyledonous = ఏకబీజదళముగల; ఏకాంకురదళబీజ సంబంధ.

Monoecius = ద్విలింగపు.

Monocros = శృంగాశ్వము.

Monominal = ఏకనామిక; ఏకనామోక్తి; ఏకపద.

Mono stellic = ఏక స్తంభి.

Monsoon = వర్ష ఋతువాయువు.

Mono stroma = ఏకపత్రము.

Mood = అవస్థ.

Morass = చిత్తడినేల; బాడవనేల.

Morning star = ప్రాతఃకాల తార.

Morphology = రూపనిర్మాణ శాస్త్రము; ఆకారవిజ్ఞానము.

Motion = గతి; చలనము; గమనము.

Mortar = గార: ఖల్వము; రోలు.

Moss = నాచు; పాచి; పాకుడు.

Moth = చిమ్మటపురుగు; శలభము; బట్టలుకొట్టు పురుగు.

Mother of Pearl = ముత్యపు చిప్ప.

Motor nerves = చలన నాడులు.

Mould = అచ్చు.

Mouth piece = పీక.

Mucus = అమము; శ్లేష్మము; చీమిడి; కాం|| పదార్థము.

Mucus membrane = శ్లేష్మత్వక్కు; తడిచర్మము; అమత్వచము; శ్లేష్మపొర; శర.

Mulberry = పూతికచెట్టు; పట్టుపురుగు చెట్టు.

Multicostate = బహుకోష్ఠము.

Multinominal = బహునామిక; బహుపద.

Multiple = గుణిజము; భాజ్యము; అపవర్త్యము.

,, Common = సామాన్యగుణిజము.

,, Least Common = కనిష్ఠసామాన్య గుణిజము.

Multiple images = బహుబింబములు.

Multiplication = గుణకారము; హెచ్చవేత;

,, Cross = అడ్డగుణకారము; వజ్రాభ్యాసము; అభిగుణకారము.

Multiplier = గుణకము.

Multiply = గుణించుట; పెంచుట.

Multipolar cell = బహుధ్రువకణము.

Multivulvular = బహుకవచి.

Mumps = గవదలు; గాలి బిళ్లలు.

Muscle = స్నాయువు; పేశీ; కండరము; మాంసరజ్జు.

Muscle Abductor = అపకర్షక (బహిక్షేపక) స్నాయువు.
,, Abductor Magnus = మహాపకర్షకస్నాయువు.
,, Abductor Pollicis = అంగుష్ఠాపకర్షకస్నాయువు.
,, Accelerator Urinae = లవనీస్నాయువు.
,, Acromio Clavicular ligament = అంసాక్షక సంయోజక స్నాయువు.
,, Adductor Magnus = గరిష్ఠఊరువ్యూహస్నాయువు.
,, Anconeus = కఫోత్తానకస్నాయువు.
,, Attrahens Aurem = కర్ణప్రాక్ స్నాయువు.
,, Azygos Uvulae = కాకలీస్నాయువు.
,, Biceps = ద్విపద; ద్విశిరస్నాయువు.
,, Brachialis = కూర్పరద్వారికా స్నాయువు.
,, Brachialis Anticus = ప్రాకూప్రగండ స్నాయువు.
,, Buccinator = కపోలికాస్నాయువు; వేణువాదకస్నాయువు.
,, Coccygeus = గుదాస్థిస్నాయువు.
,, Complexus = శిరోగ్రీవపృష్ఠీయస్నాయువు.
,, Compressor Naris = నాసాసంకోచకస్నాయువు.
,, Compressor Urethrae = మూత్రనాళికాశ్లేషక స్నాయువు.
,, Concoid Ligament = త్రికోణికాఖ్య స్నాయువు.
,, Constrictor of pharynx = కంఠసంకోచిక స్నాయువు.
,, Coraco-brachialis = కాక్షాష్ఠికా స్నాయువు.
,, Corrugator supercilius = భ్రూసంకోచకస్నాయువు; భ్రూకుటి స్నాయువు.
,, Crureus or Vastus intermidis = ఊరుప్రసారకస్నాయువు.
,, Deltoid = అంసప్రచ్ఛదస్నాయువు; అధిస్కంధస్నాయువు.

Muscle, Depressor anguli oris = సృక్కణీనమకస్నాయువు.

,, Depressor labi inferioris = అధరావనమకస్నాయువు; అధరోష్ఠనికర్షకస్నాయువు.

,, Digastric = ద్విగుంఫికస్నాయువు.

,, Dilator Naris = నాసాప్రసారకస్నాయువు.

,, Dorsal Interossei = ప్రత్యక్కూర్చ మధ్యస్నాయువు.

,, Erector clitoridis = యోనికందోత్థాపకస్నాయువు.

,, E rector Penis = శిశ్నాపహర్షకస్నాయువు.

,, Extensor = ప్రతానకస్నాయువు; వితానకస్నాయువు.

,, Extensor Carpi = కరప్రసారకస్నాయువు.

,, External hallucis longus = పాదాంగుష్ఠప్రసారకస్నాయువు.

,, External pterygoid = హనుమూలకర్షకస్నాయువు.

,, Flexor = సంకోచకస్నాయువు.

,, Flexor Carpi (radials and ulnaris) = పాణిసంకోచకస్నాయువు.

,, Flexor hallucis brevis = పాదాంగుష్ఠసంకోచకస్నాయువు.

,, Flexor Sublimis digitorum = అంగుళీసంకోచకస్నాయువు.

,, Gastrocnemius = పిండకగతస్నాయువు; పిండకస్నాయువు.

,, Gemelli = యమలస్నాయువు.

,, Genio-hyoglossus = చిబుకజిహ్వాకంఠికస్నాయువు.

,, Gluteus = నితంబపిండకస్నాయువు.

,, ,, Maximus = అధినితంబపిండకస్నాయువు.

,, Hyo glossus = జిహ్వాకంఠికస్నాయువు.

,, Iliacus = శ్రోణిపక్షీయస్నాయువు; అధికటీరస్నాయువు.

**Muscle**, Inferior oblique (muscle of the eye) = అధస్తిర్యక్ స్నాయువు.

" Infra-spinatus = అధరాంసపృష్ఠిక స్నాయువు.

" Inter Costal = పర్శ్వాంతరిక స్నాయువు.

" Inter Coastal, external = బహిః పార్శ్విక స్నాయువు.

" " Internal = అంతః పార్శ్విక ,,

" Inter-occeous Membrane = కలారూప స్నాయువు.

" Latissimus dorsi = కటిపార్శ్వ ప్రచ్ఛద స్నాయువు.

" Levator anguli Scalpulae = అంసోన్నామక స్నాయువు.

" Levator ani = గుదోత్కర్షక స్నాయువు.

" Levator labii inferioris = హనూత్కర్షక స్నాయువు.

" Levator labii Superioris = ఓష్ఠసముత్కర్షక స్నాయువు.

" " " " Alequi Nasi = ఊర్ధ్వోష్ఠనాసాపుట స్నాయువు.

" Levator menti = చిబుకోత్క్షేపణి స్నాయువు.

" Levator palati = తాలూత్తోలక స్నాయువు.

" Levator Palpebrae = ఉన్మీలిక స్నాయువు.

" Linea aspera = ద్విధారాప్రాకార స్నాయువు.

" Longissimus Capitis = పృష్ఠదండిక స్నాయువు.

" Lumbricales = మార్దంగిక స్నాయువు.

" Lymphatic = రసాయని; రసవహా స్నాయువు.

" Manubrium = ఉరఃఫలక గ్రైవేయక స్నాయువు; ఉరో గ్రైవేయక స్నాయువు.

" Masseter = హనుకూటకర్షక స్నాయువు; చర్వక స్నాయువు.

" Medulla oblangata = సుషుమ్నాశీర్షక స్నాయువు.

Muscle, Middle Constrictor of pharynx = మధ్యమకంఠ సంకోచక స్నాయువు.

,, Mylo-hyoid = ముఖభూమి కంఠిక స్నాయువు.

,, Obliquus externus = బాహ్యవక్రకాక్షిక స్నాయువు.

,, ,, Internus = అంతర్వక్రకాక్షిక స్నాయువు.

,, ,, Oculi inferioris = అధస్తిర్యక్ స్నాయువు.

,, ,, ,, Superioris = ఊర్ధ్వతిర్యక్ స్నాయువు.

,, Obturator internus = అంతరస్థశ్రోణి గవాక్షీయ స్నాయువు.

,, Obturator externus = బహిఃశ్రోణిగవాక్షీయ స్నాయువు.

,, Occipito-frontalis = లలాట సంకోచక స్నాయువు; శిరచ్ఛద స్నాయువు.

,, Omo-hyoid = అంసకంఠక స్నాయువు.

,, Orbicularis oris = ముఖముద్రిణిపేశి; కపోలికాపేశి; ఆస్యవలయ స్నాయువు.

,, Orbicularis Palpebrarum = నేత్రనిమీలిక స్నాయువు; అధో భృకుటిస్నాయువు; నేత్రనిమీలినిపేశి.

,, Palmaris Interossei = ప్రాక్కూర్చమధ్య స్నాయువు.

,, Palmaris Longus = కరతల ప్రసారక స్నాయువు.

,, Pectoralis Major = ఉరోజ స్నాయువు; గరిష్ఠ ఉరః ప్రచ్ఛద స్నాయువు.

,, Pectoralis minor = లఘు ఉరఃప్రచ్ఛద స్నాయువు; క్షుద్రోరస స్నాయువు.

,, Peroneus = పాదవివర్తక స్నాయువు,

,, Popliteus = జానుపృష్ఠిక స్నాయువు.

Muscle, Pronator = బహిరావర్తక స్నాయువు.
,, Pronator radii teres = దీర్ఘకర వివర్తక స్నాయువు.
,, Psoas magnus = దీర్ఘకటిలంబి స్నాయువు.
,, Pyramidalis Nasi = నాసామూల స్నాయువు.
,, Pyriformis = శుండిక స్నాయువు.
,, Quadratus femoris = ఊరుచతురస్ర స్నాయువు.
,, Quadratus lumbrorum = కటిచతురస్ర స్నాయువు.
,, Quadriceps = చతుష్పద స్నాయువు.
,, Rectus = ఋజుస్నాయువు; ఋజుపేశి.
,, Rectus abdominis = ఉదరదండిక స్నాయువు.
,, Rectus Externus = బహిరపాంగస్నాయువు; బహిర్దర్శిని స్నాయువు.
,, ,, Inferioris = ఋజ్వధః స్నాయువు.
,, ,, Internus = అంతర్దర్శినిస్నాయువు; అంతరపాంగస్నాయువు.
,, ,, Superioris = ఊర్ధ్వదర్శినిస్నాయువు: ఋజుఊర్ధ్వస్నాయువు.
,, ,, Capitis anticus = శిరఃపూర్వదండిక స్నాయువు.
,, Rectus Capitis Lateralis = శిరఃపార్శ్వదండికస్నాయువు.
,, Rectus Capitis Posticus = శిరఃపృష్ఠదండికస్నాయువు.
,, Retrahens aurem = కర్ణపృష్ఠిక స్నాయువు.
,, Rhomboideus = అంసాపకర్షక స్నాయువు,
,, Sartorius = దీర్ఘయామస్నాయువు.
,, Scalenus anticus and medius = పురోగణిమధ్యమపార్శ్వ కర్షక స్నాయువు.
,, Scalenus posticus = పృష్ఠకపర్శుకాకర్షకస్నాయువు.
,, Semi-membranosus = కలాకల్పస్నాయువు.

Muscle, Serratus magnus = మహా అరిత్రాకారస్నాయువు.
కరపత్రకస్నాయువు; రంపపుఆకారస్నాయువు.

,, Soleus = సుతలస్నాయువు.

,, Sphincter Ani = గుదసంకోచకస్నాయువు.

,, Splenius Capitis = శిరోగ్రీవవివర్తకస్నాయువు.

,, Stapedius = కర్ణాంతరికస్నాయువు.

,, Sterno hyoid = ఉరఃకంఠికస్నాయువు.

,, Sterno mastoid = ఉరఃకర్ణమూలికస్నాయువు.

,, Stylo-glossus = శిఖారసనికస్నాయువు.

,, Stylo hyoid = శిఖాకంఠికస్నాయువు.

,, Stylo-pharyngeus = శిఖాగళాంతరీయస్నాయువు.

,, Subclavian = అక్షకాధరస్నాయువు; అధోజత్రుస్నాయువు.

,, Subcostales = అధఃపార్శ్వకస్నాయువు.

,, Subscapularis = అంసాంతరికస్నాయువు.

,, Superior oblique (muscle of the eye) = ఊర్ధ్వతిర్యక్ స్నాయువు.

,, Supinator = అంతరావర్తికస్నాయువు; ఉత్తానకస్నాయువు.

,, Supra Spinatus = ఊర్ధ్వఅంసపృష్ఠీయస్నాయువు.

,, Temporalis = శంఖచ్ఛదస్నాయువు.

,, Tensor Palati = తాలూత్తంసకస్నాయువు.

,, Tensor Tarsi = అశ్రువిసర్జనిపేశీ; పక్ష్మస్నాయువు.

,, Tensor tympani = పటహోత్తంసిస్నాయువు.

,, Teres major = బృహత్ అంసాధరికస్నాయువు; మహావృత్త స్నాయువు.

,, Teres minor = లఘుఅంసాధరికస్నాయువు; లఘువృత్తస్నాయువు.

Muscle Tibialis anticus = అంతర్జంఘస్నాయువు; జంఘాపురోగ స్నాయువు.

„ Tibialis posticus = జంఘానుగస్నాయువు.

„ Transversalis abdominis = ఉదరచ్ఛద స్నాయువు.

„ Transversus perineum = గుదకర్షక స్నాయువు.

„ Trapezoid ligament = చతురశ్రిక స్నాయువు.

„ Trapezium = పృష్ఠచ్ఛద స్నాయువు.

„ Triceps = త్రిపద (త్రిశిర) స్నాయువు.

„ Vertebral border = పృష్ఠవంశానుగాధారపేశి.

„ Zygomaticus (major) = బృహత్సేతు స్నాయువు.

„ „ Minor = లఘుసేతు స్నాయువు.

Muscles, Voluntary = స్వతంత్రకండరములు; ఐచ్ఛికపేశ్యములు.

„ Involuntary = పరతంత్రకండరములు; అనైచ్ఛికపేశ్యములు.

Muscular fibre = కండర తంతువులు; స్నాయుపక్ష్మము.

Muscle rings = స్నాయు చక్రములు.

Musca = భరణి.

Music = శ్రావ్యధ్వని.

Mutual dependence = అన్యోన్యాశ్రయము.

Mycelium = బూజు.

Myocarditis = హృద్స్నాయుదాహము.

Myology = స్నాయువర్ణన.

Myopia = హ్రస్వదృష్టి.

Myosin = మాంసకండరములలోని మాంసకృత్తులు.

Mytilus = నత్తగుల్ల వంటి పురుగుజాతి.

## N

Nadir = అధోబిందువు.

Narcotic = నిద్రనుకలిగించునది; మాదకము; నిద్రాకారి.

Nasal = నాసికాసంబంధమైన; Nasal bone = నాసికాస్థి.

Nascent = అణుతూపమైన.

Natural Classification = స్వాభావికవర్గనిరూపణము;

,, heat = స్వాభావికోష్ణము.

,, properties = స్వభావజన్యధర్మములు.

,, Sciences = భౌతికశాస్త్రములు; ప్రకృతిశాస్త్రములు.

,, Variation = నైసర్గికస్వత్యాసము.

Nature = ప్రకృతి.

Nausea = వికారము; వాంతి; Nauseant = వాంతికారకౌషధము.

Nautical almanac = నావికపంచాంగము.

Naval base = నావికాస్థితము.

Nebula = నక్షత్రమేఘము; శుక్లపటలము; తేజోమేఘము.

Necrosis = అస్థిశోధము; పేశీసంఘాతము (Tissue) చచ్చుబడుట.

Nectar = మకరందము; పూదేనె.

Nectary = మకరందకోశము:

Negation = అభావము.

Negative = ఋణాత్మక.

,, electricity = ఋణవిద్యుత్.

,, Pole, Cathode = ఋణధ్రువము.

proposition = నిషేధవాక్యము.

Quantity = ఋణరాశి.

Sign = ఋణసంజ్ఞ.

Negative Terms = నిషేధవాచకములు.

Nemato cyst = తంతి తిత్తి.

Neodymium = నోడిమము (ర) ఒక ధాతువు.

Neon = న్యూనము (ర). ,,

Nephritis = మూత్రకోశపువాపు; వృక్కశోఫ; మూత్రపిండదాహము.

Neptune = నెప్ట్యూన్‌గ్రహము; ఇంద్రగ్రహము.

Nerium = గన్నేరు

Nerve = మజ్జాతంతువు; జ్ఞానతంతువు; నాడి.

,, Accelerator = గతివర్ధక మజ్జాతంతువు.

,, Excitatory = క్షోభక ,,

,, Inhibitory = నియామక ,,

,, Motor = గతివాహక ,,

,, Secretory = రసవిమోచక ,,

,, Sensory = జ్ఞానవాహక ,,

Nerve cell = మజ్జాగోళకము; నాడీకణము.

,, ,, Distributing = ప్రేరణాంశదాయక మజ్జాతంతు గోళకము.

,, ,, Intermediary = మధ్యస్థితమజ్జాగోళకము.

Nerve disease = మజ్జావికారము; మజ్జాతంతురోగము.

Nerve fibre = మజ్జాపక్ష్మము; నరము.

,, ,, Afferent = అభిగామిమజ్జా పక్ష్మము.

,, ,, Inter-central = పీఠాంతరీయ మజ్జా ,,

,, ,, Non-medulated = మజ్జాకవచహీనమజ్జా ,,

Nerve force = మజ్జాతంతుశక్తి.

,, Ganglion = మజ్జామండముల; మజ్జాకందము.

,, Root = మజ్జాతంతుమూలము.

Nerve, System = మజ్జాతంతు సంఘాతము; మజ్జారచన; నాడీవ్యూహము.
,, Tonic = మజ్జాతంతు పుష్టికారకౌషధము; మజ్జాతంతు తేజకౌషధము
,, Articular = సంధిస్థమజ్జాతంతువు.
,, Auditory = కర్ణేంద్రియ మజ్జాతంతువు.
,, Auricularis Magnus = బృహత్ కర్ణగామి మజ్జాతంతువు.
,, Auricula temporal = కర్ణశంఖీయ మజ్జాతంతువు.
,, Cardiac = హృద్గామి ,,
,, Cervical = గ్రైవేయక ,,
,, Cervico facial = గ్రీవాతుండీయ ,,
,, Chorda tympani = లాలోత్పాదక మజ్జాతంతువు.
,, Circum flex = భుజవేష్టని ,,
,, Coccygeal = గుదాస్థి ,,
,, Communicans noni = గ్రైవేయకసమ్మేళక ,,
,, Compound = మిశ్ర; సంయుక్త ,,
,, Cranial = మస్తక; శీర్షీయ ,,
,, Crural anterior = ప్రాగూరుత్వక్స్థ ,,
,, Cutaneous = త్వక్ ,,
,, Dental = దంత్య ,,
,, Digastric = మధ్యకండరాస్నాయుగామి ,,
,, Dorsal = పృష్ఠీయ మజ్జాతంతువు.
,, Facial = ముఖగామి ,,
,, Frontal = కాపాలిక ,,
,, Gastric = జాఠర ,,
,, Genito-crural = ఉపస్థోరుగ మజ్జాతంతువు.

Nerve, Glosso-pharyngial = సప్తపద రసజ్ఞ మజ్జాతంతువు; జిహ్వాగళగామి మజ్జాతంతువు.
,, Gluteal = నితంబీయ మజ్జాతంతువు.
,, Gustatory = రసజ్ఞ ,,
,, Hypo-glossal = బృహజ్జిహ్వాచాలక ,,
,, Infra-orbital = అధోక్షికోశీయ ,,
,, Inter-costal = పార్శ్వకాభ్యంతర ,,
,, Laryngeal recurrent = అవగ్రకకంఠనాడీస్థమజ్జాతంతువు
,, Lumbar = కటిస్థమజ్జాతంతువు.
,, Masseteric = అధోదంతాస్థిక మజ్జాతంతువు.
,, Maxilliary, Superior = ఊర్ధ్వదంతాస్థిక ,,
,, ,, Inferior = కపోలగామి ,,
,, Median = మధ్యగత (మాధ్యమిక) ,,
,, Motor = గతివాహక ,,
,, Motor occuli = నేత్రమూలిక ,,
,, Musculo spiral = భుజగ ,,
,, Nasal = నాసాగామి ,,
,, Obturator = ఊరువంక్షణ సంధిస్థ ,,
,, Occipitalis = శిరఃపృష్ఠకపాలగామి ,,
,, Olfactory = ఘ్రాణేంద్రియ ,,
,, Opthalmic = చక్షుర ,,
,, Optic = చక్షురింద్రియ ,,
,, Palmar = కరతలస్థ ,,
,, Patheticus = నేత్రోర్ధ్వ స్నాయుగామి ,,
,, Petrosals = మేకల మండల ,,

Nerve, Pharyngeal = సప్తపది  మజ్జాతంతువు.
,, Phrenic = మధ్యపటలీయ  ,,
,, Pneumogastric = క్లోమ జఠరగామి  ,,
,, Popliteal Internal = అంతర్జానుక  ,,
,, ,, External = బహిర్జానుక  ,,
,, Radial = ప్రకోష్ఠీయ  ,,
,, Sacrals = త్రైక  ,,
,, Saphenous, long = అంగుష్ఠదీర్ఘ  ,,
,, Sciatic, great = మహా అసనాస్థి  ,,
,, ,, Small = లఘు అసనాస్థి  ,,
,, Sensory = జ్ఞానవాహక  ,,
,, Spinal accessory = సహాయకపృష్ఠవంశీయ ,,
,, Spinal = పృష్ఠవంశీయ  ,,
,, Splanchnic = వృకోర్ధ్వ పేశీగామి  ,,
,, Supra orbital = ఊర్ధ్వోష్ఠక  ,,
,, Supra trochlear = లాలాటిక  ,,
,, Sympathetic = అనుకంపిక  ,,
,, Thoraic = కరపత్రిస్నాయుక  ,,
,, Tibials posterior = ప్రత్యగ్జంఘాస్థిక  ,,
,, Tibials anterior = ప్రాగ్జంఘాస్థిక  ,,
,, Trigeminus or Trifacial = త్రిముఖగామి,,
,, Tympanic = మధ్యకర్ణిక  ,,
,, Ulnar = అన్తః ప్రకోష్ఠీయ  ,,
,, Vasomotor = ధమనిచాలక  ,,

Nervous debility = నరములబలహీనత.

Net of Solid = ఘనాకారముయొక్క అల్లికపటము.

Nettle = దూలగొండి.

Nettle-rash = శీతపిత్తము.

Net value = నిలువఫలము; నికరఫలము.

Neuralgia = మజ్జాతంతువేదన.

Neurasthania = మజ్జాతంతుకార్యక్షీణత; మజ్జాతంతుక్రియాదౌర్బల్యము.

Neuritis = మజ్జాతంతుదాహము.

Neutral = తటస్థభావము.

New Radiation = నవప్రసరణము; అభినవకిరణవిసర్జనము; (రామనుగారి నూతన పరిశోధన).

Newt = నల్లికండ్లపాము.

Nickel = నికెలం; నికిలము (ర)

Night blindness = రేచీకటి.

Nimbus clouds = కారుమబ్బులు.

Nitrate = నత్రితము.

,, of potassium = సూరేకారము.

Nitre = పెట్లుప్పు; సూరేకారము.

Nitric Oxide = నైట్రికాక్సైడు; నత్రికామ్లజనిదము.

Nitrogen = నత్రజని; సారజనకము; దహ్యాక్షారధాతువు; లవణవాయువు.

Nitrogen monoxide = నత్రజ ఏకామ్లజనిదము.

,, Dioxide = నత్రజ ద్వ్యామ్లజనిదము.

,, Pentoxide = నత్రజ పంచామ్లజనిదము.

,, Trioxide = నత్రజ త్ర్యామ్లజనిదము.

Nitrogen tetroxide = చతురమ్లజనిదము.

Nitrogen trihidride = నత్రిజత్రియుదజనిదము.

Nitrogenous = నత్రిజనసంబంధమైన; సారజనక సంబంధ.

Node = స్కంధశిఖరము; గంటు; పర్వము; కణుపు; (2) గ్రహపాతము; కక్షాపాతము.

Noise = కర్కశధ్వని.

Nomads = దేశదిమ్మరులు.

Nomenclature = పరిభాష.

Nonagon = నవాస్రము; నవభుజము.

Non-conductor of electricity = అవిద్యుత్వాహకము;

,, of heat = అనుష్ణవాహకము.

Non living = అజీవ; నిర్జీవ; జడ.

Non luminous = కాంతిరహిత.

Nonmetal = ఉపధాతువు; నిర్ధాతువు.

Nonmetallicoxides = ఉపామ్లజనిదములు.

Non Sequitor = నిరాధార (మగు నిగమము).

Normal = ముఖ్యలంబము; ప్రమాణప్రకార; ప్రమాణిక (2) లంబరేఖ.

Normal motion = కేంద్రాకర్షణము: కేంద్రోద్గమము.

Normative Science = విధాయక శాస్త్రము.

Notation = సంకేతచిహ్నగణితము; సంజ్ఞామానము; అంకసంకేతము; సాంకేతిక గుఱుతులతో అంకెలువేయుట; సంఖ్యాలేఖనము.

,, abridged = సంగ్రహసంజ్ఞామానము; సంగృహీత; సంక్షిప్తసంజ్ఞ

Notch = పరిఖ; ఖాతము; ద్వారము.

,, Ethmoidal = శేత్రిమహాపరిఖ.

Notch Great Sacrosciatic = గృధ్రసీద్వారపరిఖ.

,, Lachrymal = అశ్రుపీఠఖాతము.

,, Sacrosciatic = కుకుందరద్వారము.

,, Spheno-Palatine = తాలుజాతుక ఖాతము.

,, Supra-Capsular = అంసశిరఃకోటరఖాతము.

,, Sigmoid = అర్ధచంద్రాకార ఖాతము.

Notion = అనుభవము.

Notional = మనఃకల్పితమైన.

Nourishing = పుష్టిచేయు; బలకరమైన.

Nuclear membrane = జీవస్థానకవచము.

Nucleolus = జీవస్థానగర్భము; అంతర్జీవస్థానము.

Nucleus = అద్యజీవకణస్థానము; జీవపరమాణువు; ప్రోటోప్లాసంలోని నిలుకడ పదార్థము. ఒకకణములోని మధ్యబిందువు, లేక చుక్క— మూలబిందువు; (2) బీజము.

Numb = తిమ్మిరు పట్టిన; చచ్చుపడిన.

Number = సంఖ్య; రాశి; అంకము.

,, Abstract = వియుక్తసంఖ్య; శుద్ధసంఖ్య; సాధారణసంఖ్య; నిరుపాధికసంఖ్య.

,, Amicable = యుగళాత్మక సంఖ్య.

,, Cardinal = ముఖ్యసంఖ్య; ప్రత్యయరహితసంఖ్య; మూలాంకము; సంఖ్యార్థము.

,, Commersurable = మితసంఖ్య.

,, Composite = మిశ్రసంఖ్య; చేరియున్న; గుణజ.

,, Compound = యుక్తసంఖ్య.

,, Concrete = మిశ్రసంఖ్య; సమహితసంఖ్య; సంయుక్తసంఖ్య; సోపాధిక, పరిగణిత; వ్యావహారికసంఖ్య.

Number Directed = ఉపలక్షితసంఖ్య.
,, Even = సమసంఖ్య.
,, Evenly even = సమసమసంఖ్య.
,, Evenly odd = సమవిషమసంఖ్య.
,, Figurative = సంకలితసంఖ్య.
,, incommensurable = భిన్నసంఖ్య.
,, irrational = కరణి సంఖ్య.
,, mixed = సంకీర్ణసంఖ్య; మిశ్రిత సంఖ్య.
,, natural = ప్రాకృతిక; స్వతస్సిద్ధక్రమసంఖ్య; ఏకాదిక్రమసంఖ్య.
,, Negative = ఋణసంఖ్య.
,, Odd = విషమ సంఖ్య.
,, Oddly odd = విషమవిషమ సంఖ్య.
,, of terms = గచ్ఛము.
,, Perfect = పూర్ణసంఖ్య; సంఖ్యనిధి.
,, Prime = అదిమ, ఉత్తమ సంఖ్య; దృఢాంకము.
,, Pologanal = బహుభుజాకారసంఖ్య.
,, Positive = ధనసంఖ్య.
,, Prime = ప్రధాన సంఖ్య.
,, Proportional = సజాతీయ సంఖ్య.
,, Pure = శుద్ధ సంఖ్య.
,, Rational = మూలక సంఖ్య.
,, Real = ప్రత్యక్షసంఖ్య; వాస్తవ్యసంఖ్య.
,, Relation = సంబంధిసంఖ్య.

Number Triangular = త్రిభుజాకారసంఖ్య.

,, whole = పూర్ణసంఖ్య; అభిన్నసంఖ్య.

Numeration = సంఖ్యామానము; సంఖ్యావాచకము. సంఖ్యను చదువుటకు శబ్దములతో వ్రాయుట.

Numerator = అంశము; లవము.

Numerical = సంఖ్యాసంబంధమైన; సాంఖ్య.

Nurse = రోగశుశ్రూషకురాలు; రోగులకు సేవచేయుస్త్రీ; దాది.

Nursing = రోగశుశ్రూష, చాకిరి, సేవ.

Nursery = శిశుసంరక్షణమందిరము.

Nutrition = జీర్ణపద్ధతి; పోషణము.

Nux vomica = ముషిణి.

## O

Oak = సిందూరవృక్షము.

Oasis = ఎడారిలోనివిశ్రాంతిస్థలము; సైకతాంతరఫలవంతప్రదేశము.

Obesity = అతిస్థూలత; మేదోవృద్ధి.

Oblique = వంకర; తిర్యక్; ఐమూలగానున్న.

Oblong = దీర్ఘచతురము; ఆయతము.

Observation = అవలోకనము; నిరీక్షణము; వేధ.

Observatory = వేధశాల; అవలోకనశాల; నక్షత్రావలోకనశాల.

Obturator Formen = శ్రోణిగవాక్షము.

Obtuse = బహిర్లంబ.

,, angle = లంబకోణము; గురుకోణము.

Obverse; Obversion = ప్రతిలోమ్యము.

Obvert = ప్రతిలోమించు.

Occipital = కపాలమూలిని; శిరఃపృష్ఠాస్థి.

Occurence = సంభవము; సంఘటనము.

Ocean bed = సముద్రశయ్య.

Ocean currents = సముద్రప్రవాహములు.

Octagon = అష్టాస్రము; అష్టభుజము.

Odd = ఓజ; బేసి; విషమ.

Odometer = శకటవేగ దర్శకయంత్రము.

Oesophagus = అన్ననాళిక; అన్నపథము.

Offensive trades = పీడాకరవ్యాపారములు.

Offset = లంబపరిమాణము; అంతరలంబము.

Okra = బెండ.

Oils = తైలములు.

Ointment = విలేపనము; విలేపనౌషధము; మలాము.

Olfactory Nerves = ఘ్రాణనాడులు.

Olive = జితవృక్షము.

Omniverous = సర్వభక్షక.

Oosicles (of ear) = శ్రుతిపటలములోనుండు మూడు చిన్నఎముకలు.

Oospore = సంయోగబీజము.

Opaque = అపారదర్శక; ప్రకాశావరోధక; నిష్ప్రభము; అద్దమువలె అవతలవస్తువు కనబడనిగుణము.

Operation = కార్యము; కృత్యము; పరికర్మ; (2) శస్త్రచికిత్స.

,, Fundamental = ముఖ్యకార్యము; ప్రధానపరికర్మ.

Ophalian = ఫేకాంత్రికములు.

Operator = కారకము.

Ophiology = సర్పశాస్త్రము.

Opoisometer = వక్రరేఖాదీర్ఘమాని.

Opposite arrangement = అభిముఖముగుచేరిక.

Opposition of proposition = వాక్యవిరోధము.

Opthalmology = నేత్రవైద్యము; నేత్రవిద్య.

Optics = తేజఃశాస్త్రము; వెలుతురు, దృష్టినిగూర్చినది.

Optical Centre = చక్షుర్మధ్యము.

Optcial instruments = దృగ్యంత్రములు.

Optic nerve = నేత్రనాడి.

Optimum temperature = తగువెచ్చన.

Orang-outang = అలకబోతు; వాలిడి; తోకలేనికోతి.

Orb = బింబము.

Orbit = అక్షిగోళము; కనుగుంట.

Orchitis = వృషణవృద్ధి.

Ordinal number = క్రమద్యోతసంఖ్య; క్రమాలకము.

Ordinate = ద్వితీయసంబంధకము; నిలువుభుజము; నిరూపకము.

Ore = ఖనిజము.

Organs = అవయవములు.

Organic = సేంద్రియ.

Organic chemistry = సేంద్రియరసాయనశాస్త్రము.

,, rocks = జీవజశిలలు.

Origin = మూలస్థానము; మూలబిందువు; (2) ఉత్పత్తి; (తర్క)

Orion = మృగశీర్షము.

Orionis = ఆర్ద్ర.

Ornithology = పక్షిశాస్త్రము.

Orris = వస.

Orthocentre = లంబకేంద్రము.

Orthocirumcentre = లంబసంధి; లంబకేంద్రము.
Orthogonal = లంబసంబంధమైన; సమకోణాకృతి.
Orthophosphates = ఋజుస్ఫురితములు.
Orthophosphoric acid = ఋజుస్ఫురకామ్లము.
Oscillation = ఊపు.
,, method of = డోలాయమానపద్ధతి.
Osmium = ఓస్మము (ర).
Osmosis = సూక్ష్మస్థితి; పరస్పరసంబంధము.
Osteology = అస్థిశాస్త్రము.
Otorrhoea = కర్ణస్రావము; చెవిలో చీముకారుట.
Outline = ఆకారరేఖ, చుట్టుగీత; రూపురేఖ; గిరిగీత.
Outpost = కావలి స్థలము.
Outward Stimulus = బహిఃప్రేరణ.
Oval = అండాకార.
Ovary = అండకోశము; స్త్రీలబీజాశయము.
Ovate = అండాకృతిగల; గోళాకార.
Overhauling = తరుగవేత; మరమ్మతుకొరకు విప్పుట,
Overlapping = పరస్పరము వ్యాపించుట; ఒకదానిమీద కింకొకటివచ్చుట.
Overtone = అతిస్వరము.
Oviparous animal = అండదము; గుడ్లనిడు జంతువు.
Ovule = పుష్పములోని స్త్రీలబీజాశయము; అండము.
Ovum = గుడ్డు; అండము; స్త్రీలబీజము.
Ounce = ఔన్సు.
Oxidation = అమ్లజనీకరణము; భస్మీకరణము.

Oxides = అమ్లజనిదములు.

Oxide of Carbon = కర్బనామ్లజనిదము.

,, Nitrogen = నత్రజామ్లజనిదము.

Oxide of iron = లోహామ్ల జనిదము.

Oxide of magnesium = మగ్నామ్ల జనిదము.

,, Phosphorous = స్ఫురామ్ల జనిదము.

Oxides of Potassium-and Sodium = పొటాసియ సోడియామ్ల జనిదము

,, Sulphur = గంధకామ్లజనిదము.

Oxy-acids = అమ్లజనామ్లములు.

Oxy-salts = అమ్లజనిలవణములు.

Oxygen = ప్రాణవాయువు; అమ్లజని.

Oyster = శీపి; గుల్లచేప.

Oxalma = పీనసము.

## P

Pabchi = బాకంచా.

Pad = మెత్త.

Paints = పూతరంగులు.

Palate = అంగుడు; అంగిలి; తాలుమండలము.

Palea = భుజములు.

Palisade tissue = స్తంభావళి.

Palladium = పలాదము (ర).

Palmate = తాళపత్రాయిత.

Palmyrah = తాటిచెట్టు.

Palpitation = గుండె అదరు; గుండెదడ.

Pancreas = అగ్న్యాశయము; వృక్క్యకములు; స్వాదుపిండము; అనామిక పిండము.

Pancreatic artery = స్వాదుపిండధమని,
Pancreatic duct = మధు (రస) వాహిక; స్వాదుపిండనాడి.
,, Juice = మధురసము; స్వాదుపిండరసము.
,, Duodenal artery = స్వాదుపిండ పోషకధమని.
Pancreatitis = స్వాదుపిండదాహము; అగ్న్యాశయదాహము.
Panicle = చుళుకము; రెమ్మగెల.
Panoramic view = సర్వదిగ్దర్శక దృశ్యము.
Panotitis = చెవిపోటు.
Pans = పళ్లెములు.
Pantograph = పటప్రతిలేఖని.
Papillae = కండకములు; గుబ్బలు; చిన్నమొటిములు.
Par = సరాసరి; సమము; బరాబరు.
Parabola = పరవలయము; బాణాకారకక్ష్య.
Park = ఉద్యానవనము.
Parallax = స్థానభేదభ్రమ; లంబనము.
Parallel = సమాంతర; సమరేఖాయుత; సమాంతరవ్యాప్త.
,, Lines = సమాంతరరేఖలు.
Parallelism = సమాంతరత్వము.
Parallelogram = సమాంతర చతుర్భుజము.
Parallelopiped = సమాంతర ఖాతము.
Parallel venation = సమానరేఖ పత్రము.
Parallels of latitude = సమాంతర అక్షాంశవృత్తములు.
Paralysis = పక్షవాయువు; పక్షవాతము.
,, Agitans = వేపథు; కంపవాయువు.
,, Genbal = అతత్వాభినివేశము.

Paraphymosis = నివృత్తమణి.

Paraphlegia = ఊరుస్తంభము.

,, Spastic = ఖంజవాతము.

Parasite = పరాన్నభుక్కు; అర్జవజీవి; ఇతరులపై జీవించునది.

Parasitic diseases = పరాన్నభుగ్జనితవ్యాధులు; శరీరము నాశ్రయించిన సూక్ష్మజీవులవలన కలుగువ్యాధులు; శరీరాశ్రిత క్రిమిజనితవ్యాధులు.

Para thyroid glands = నాలుగు కంఠ గ్రంధులు.

Parenchyma = మృదుసారము; మృదుకణసంహతి.

Parenthesis = వృత్తార్థము (వ్యాక).

Parietal bone = సీమంతాస్థి.

,, Placentation = కుడ్యసంయోగము.

Parotid = ఉమ్మిగ్రంథి.

Partial = కొంత భాగపు.

Particular = విశేష.

,, Proposition = విశేషవాక్యము.

Partnership = భాగస్వామ్యము; ఉమ్మడి.

Pass = కనుము.

Pasteurisation = పాశ్చరైజేషను; పాలుపులియకుండ 140 డిగ్రీలకు వెచ్చజేసియుంచు పద్ధతి; పాశ్చరుగారివిధానము.

Patella = మోకాలి చిప్ప; జాన్వస్థి.

Patient = రోగి; వ్యాధిగ్రస్తుడు.

Pathogenic bacteria = జబ్బులగలిగించు సూక్ష్మదండికలు.

Pathology = రోగనిదానము; వ్యాధినిర్ణయశాస్త్రము.

Pattern = మాదిరిచిత్రము; మచ్చు; నమూనా.

Pauses = విరతులు; విరామములు.

Peak = పర్వత శిఖరము; శృంగము.
Pear = బేరిపండు.
Peat = జీర్ణించిన వేళ్లు మొ॥ పదార్థములు.
Pebbles = గులకరాళ్లు.
Pedal = పాదసంబంధ.
Pedicel = ఉపవృంతము; పుష్పవృంతము.
Pedometer = నడచినదూరము దెలుపు యంత్రము.
Peduncle = కాడ, తొడిమ, వృంతము.
Peel = తోలు; పట్ట;
Peepul tree = చెట్టురావి.
Pegasi = పూర్వాభాద్ర.
Pegasus = ఉచ్చైశ్శ్రవము.
Pellate = ప్రహారిత; పత్రమధ్యప్రకోపి.
Pelvis = కూపకము; వస్తికము; కటి; పొత్తికడుపుచుట్టునుండు ఎముకల గూడు; శ్రోణిచక్రము.
,, Cavity = కూపకుహరము; శ్రోణిచక్రపుగది; వస్తిగుహ.
Pelvic Haematuria tumour = మకర్కుల్లము; రక్తగుల్మము.
Pencil = సీసలేఖిని; పెన్సిలు.
,, of rays = కిరణశలాక.
Pendulum = లోలకము.
Pentagon = పంచాస్రము; సమపంచభుజము,
Penumbra = ఖండఛాయ.
Pepsin = జఠరకము; కాలకము; జాఠరరసవికారము; పాచకతత్వము.
Peptone = మాంస సారము.
Percent = నూటికి.

Percentage = నూటికిచొప్పు; శాతము.

Percent error = నూటికివచ్చు పొరపాటు. ప్రమాదశాతము.

Percept = నిర్వికల్పము.

Perception = ప్రత్యక్షము; ప్రత్యక్షానుభవము; నిర్వికల్పజ్ఞానము.

,, of senses = ఇంద్రియ గోచరత్వము.

Percolate = స్రవించు.

Percussion = ఘట్టన; ఢీకొనుట.

Pereblem = పరిలింగము.

Peretielion = నీచ.

Perianth = పుష్పవేష్టనము; పరిపత్రము.

Pericardium హృత్కోశము.

Pericarditis = గుండెనంజు; హృదయవేష్టదాహము.

Pericarp = బీజకోశము; వితనము పైపొర.

Pericycle = ఒడ్డాణము.

Perimeter = చుట్టుకొలత; పైవారము.

Perinaeum = గుదద్వారమునకు ఉపస్థేంద్రియమునకు మధ్యప్రదేశము.

Period = ప్రవృత్తికాలము; నియమితకాలము; అవధము; కాలము

(2) బిందువు (వ్యాక.)

Periosteum = పేయంకి; అస్థికవచము; ప్రతియెముకను అవరించుకొని యుండు తెల్లనినారపొర.

Periostitis = పర్యస్థిదాహము.

Perisperm = గర్భపుకండ; అంకురబహిచ్ఛదనము.

Periscope = పరివీక్షణయంత్రము.

Peristolisis = మలోత్సర్గకచలనము; తినుకుటలోని పేగుల చలనము.

Peritoneum = అంత్రవేష్టనము; ఉదరాంత్రవేష్టనము; పర్యంత్రకము.

Peritonitis = అంత్రవేష్టన దాహము.
Permutation = అంకస్థానవ్యవహారము.
Perpendicular = లంబము; నిలువురేఖ; లంబ; నిట్టనిలువుగానుండు.
,, axis of = పరాలోకాక్షము.
,, bisector = మధ్యగతలంబ; లంబద్విఖండనరేఖ.
,, line = లంబరేఖ.
Permanent hardness = శాశ్వతఖటికత్వము;
Perseus = యయాతి.
Personal God = మనుష్యరూపధారియగు ఈశ్వరుడు.
,, Hygiene = వ్యక్తిసంబంధశౌచము.
Perspective = యథాదర్శనము; క్షేత్రవిక్షేపము; పరాలోకము; ఘనాకారములను సమక్షేత్రముమీద వ్రాసెడురీతి.
Perspiratory glands = ఘర్మోత్పాదక (స్వేదోత్పాదక) గ్రంథులు.
Persulphuric acid = పరిగంధకికామ్లము.
Pessaries = గర్భాశయాధారవలయము.
,, check = సంతాననిరోధసాధనము; రబ్బరుయోనిమూత.
Pestle = పోత్రము.
Petals = ఆకర్షణపత్రములు; రక్షకపత్రములు.
Petiole = ఆకుకాడ.
Petitio principii = ప్రకరణసమము.
Petroleum = శిలాతైలము; మట్టితైలము.
Phalanges = కర (పాద) అంగుళ్యస్థులు.
Pharma copoeia = భేషజకల్పసూత్ర సంహిత; ఔషధగ్రంధము;
(2) ఔషధ సంగ్రహము.
Pharaynx = కపపథ. Pharyngitis = గ్రపపథదాహము.

Phases of the moon = చంద్రుని కళలు.
Phenol, Phenyle = ఫినైలు; దుర్గంధనాశక ద్రావకము.
Phimosis = లింగాగ్రమున చర్మము ఎగసికొనిపోవుట; నిరుద్ధమణి.
Phlebitis = మజ్జాతంతుదాహము.
Phlegm = శ్లేష్మము; కఫము.
Phloem or Blast = త్వక్కు; చర్మము.
Phlogistic = అగ్ని సత్వ.
Phosphates = స్ఫురితములు.
Phosphate of lime = సుధాభాస్వరము.
Phosphaturia = క్షారమేహము.
Phosphite = స్ఫురాయితము.
Phosphoric acid = స్ఫురితామ్లము.
Phosphorus = స్ఫురము; స్ఫురితము; భాస్వరము.
Phosphorus trioxide = స్ఫురత్ర్యమ్ల జనిదము.
,, tetroxide = ,, చతురమ్ల ,,
,, pentoxide = స్ఫురత్పంచామ్ల ,,
Photography = ఛాయాపట గ్రహణము; ఫోటోగ్రాఫీ.
Photographic plates = ఛాయాగ్రాహక దర్పణములు.
Photons = తేజఃఖండములు.
Photo sphere = దీప్తి గోళము.
Photo Synthesis = కిరణజన్య సంయోగక్రియ.
Physical change = భౌతిక వికారము; మార్పు.
Physical Geography = భౌతిక భూగోళము,
,, Mixture = భౌతిక మిశ్రణము.

Physical phenomena = భౌతిక దృశ్యవికారములు.

,, Properties = భౌతిక ధర్మములు.

Physics = పదార్థ విజ్ఞానశాస్త్రము.

Physiology = శరీర ధర్మశాస్త్రము; శారీరశాస్త్రము.

Phthisis = కఫక్షయము; పుప్పుసక్షయము.

Picture = ప్రతిమ; చిత్తరువు.

Piles = మూలశంక; అర్శస్సు; మూలవ్యాధి.

Pimple = పొంటిమ.

Pincers = స్రావణము; తంటెసము.

Pinnate = పక్షవైఖరి; ఛేదిత.

Pint = పైంటు.

Pipe = గొట్టము.

Pippette = పిప్పెట్టు; సన్నని కొలగొట్టము.

Pisces = మీనము.

Pisces Australis = దక్షిణమత్స్యము.

Pisceum = రేవతి.

Piscivorous = మత్స్య భక్షక.

Pistachio = పిస్తా.

Pistia = అంతర తామర.

Pistil = అండకోశము.

Pistillate = స్త్రీ బీజయుక్త.

Piston = ముషలకము.

Piston rod = ముషలకదండము.

Pitch = స్థాయి; మరచీలయొక్క భ్రమణాంతరము; వాడకీలు.

Pith = బెండు; దూట; దంటు.

Pitted vessels = గుంటలుగల కాలువలు.

Pituitory body = పోషక గ్రంధి. (మెదడులోనిది)

Placenta = అండశయము; జరాయువు; మావి (2) బీజబంధము; అండలంబిన స్థానము.

Plague = ప్లేగు; బొబ్బలరోగము; మహామ్మారి; శోఫగ్రంధియుక్త సన్నిపాత జ్వరము.

Plan = ప్లాను; కల్పన, మసలతు; ఉపాయము; చిత్రము; నమూనాఆకృతి.

Plan and Elevation= భూమిఆకృతినమూనా; (ఎత్తు)పై ఆకృతినమూనా.

Plane = సమతలము; ధరాతలము; సమక్షేత్రము; సమప్రదేశము.

Plane Geometry = సరళ (రేఖా) భూమితి.

Plane Trignometry = సరళ (రేఖా) త్రికోణమితి.

Plane, Directing = కాల్పనిక సమక్షేత్రము.

,, Ground = సమభూమి.

,, Horizontal = సమాంతరసమతలము.

,, Inclined = ఉతరణ సమతలము.

,, Intersecting = ఛేదక సమతలము.

,, Objective = పదార్థవిషయక సమతలము.

,, Oblique = తిర్యక్ సమక్షేత్రము.

,, Original = మూలసమక్షేత్రము.

,, Perpendicular = లంబ సమతలము.

,, Perspective = యథాదర్శ సమతలము.

,, Picture = చిత్రభూమిక సమక్షేత్రము.

,, Vertical = ఊర్ధ్వసమతలము.

Plane-mirrior = సమతల దర్పణము.

Planets = గ్రహములు.

Plano concave = ఏకపుట.

Plano convex = ఏకకుంభ.

Plaster of parris = ప్యారిసుజిగురు,

Plateau = పీఠభూమి.

Plasma of blood = రక్తము లోనిద్రవపదార్థము.

Platinum = ప్లాటినం (ర)

Pleides = కృత్తిక.

Pleorme = అంతర్గ్రంగము.

Pleura = పుప్ఫుసవేష్టనము.

Pleurisy = ప్లూరసీ; శ్వాసకోశవేష్టనశోఫ; దాహము; ఊపిరితిత్తి పొరలోవాపు.

Pliers = సవాణము; సాగ్రహణము.

Plot points = బిందువులను గుర్తించుట; స్థాపించుట.

Plumb Level = మూలమట్టము.

Plumb line = లంబరేఖ; వేలాడుతాడుగుండు; ఓడంబము; మట్టపుతాడు.

Plumule = ప్రథమశాఖ; అంకురము; మొలక

Plures Interrogatories = బహుప్రశ్నకము; ప్రశ్నబాహుళ్యము.

Plus sign = ధనసంజ్ఞ; కూడిక గుఱుతు.

Pluto = ప్లూటోగ్రహము; (1930 లో కనుగొనబడినది.)

Pneumatic trough = వాయు సంగ్రహణ తొట్టి.

Pneumonia = న్యూమోనియా; పుప్ఫుసజ్వరము; రక్తష్ఠీవి; సన్నిపాత జ్వరము; శ్లేష్మాధిక్య సన్నిపాత జ్వరము.

Point = బిందువు; కొన; చుక్క.

,, of application = శక్తిప్రయోగ (సమయము) స్థానము.

Point of incidence = పతన బిందువు.

Pointed = మొనదీరిన.

Pointer = చూపుకోయ్య; చూపునది: సూచకము; చూపుడు ముల్లు.

Poison gland = విషగ్రంధి.

Polar body = ధ్రువ రేణువు.

,, Circles = ధ్రువవృత్తములు.

,, Region = ధ్రువమండలము.

Polarity = ధ్రువ లక్షణము.

Pole measure = పోలుకొలత.

,, Star = ఉత్తర ధ్రువతార.

Polish = మెరుగు పెట్టుట.

Pollen = పుప్పొడి.

Pollen sac = పుప్పొడి తిత్తి.

Pollination = పుష్పసంపర్కము; పరాగసంపర్కము.

,, Self = ఆత్మ పరాగసంపర్కము.

Polyadelphous = బహుబంధక.

Polyandrous = విడికింజల్కములుగల.

Polyarthritis = కీళ్లవాపులు; సంధిశోఫ.

Polygon = బహుస్రము, బహుభుజము.

Polygonal cell = బహుభుజకణము.

Polyhedron = బహుక్షేత్రావృతఘనము; బహుక్షేత్రముఖి; బహుఫలకము.

Polynominal = బహునామిక; బహుపద; బహునామికోక్తి.

Polypetallous = బహుదళ.

Polypus in the Nose = నాసార్శ; పీనస రోగము.

Polypus of the uterus = గర్భాశయార్శ.
Polysephalous = విభక్తపాత్రదళ సంబంధ.
Pome = సీతాఫలజాతి.
Pomology = ఫలవిజ్ఞాన శాస్త్రము.
Porcelain dish = పింగాణి గిన్నె.
Porcupine = ముండ్ల పంది.
Porocity = సచ్ఛిద్రత.
Portal vein = జీర్ణాశయసిర; ప్రతీహారిణి.
Position = స్థానము; స్థితి.
Positive = ధనాత్మకమైన.
Positive electricity = ధనవిద్యుత్.
,, Number = ధన సంఖ్య.
,, Quantity = ధనరాశి.
,, Terms = భావవాచకములు.
Postulate = ప్రమేయము; స్వీకృతపక్షము; అకామేనాప్యంగీకార ణీయము; ఆధార నియమములు; స్వీకృత సిద్ధాంతములు.
Potash = పొటాశియామ్ల జిదము.
Potassium = పొటాసియం.
,, Carbonate = యవక్షారము.
Potassium Chloride = పొటాశియహరిదము.
,, Nitrate = సూరేకారము.
,, Permanganate = పొటాశియ పరమాంగనితము.
,, Phosphate = పొటాసియస్ఫురితము.
Potential energy = నిలుపచేయబడినశక్తి; బీజరూపశక్తి.
Pound = పౌను (3 పౌను లొక వీసె).

Powder = చూర్ణము.

Power = శక్తి (2) ఘాతము.

,, 2nd = వర్గము; ద్వితీయఘాతము.

,, 3rd = ఘనము; త్రిఘాతము.

,, 4th = చతుర్ఘాతము.

Power conduction = వాహకశక్తి.

Practice method = ఆచరణ పద్ధతి; వ్యవహారగణితము.

Practical = ప్రయోగాత్మక; ప్రయోగవేద్య; అనుభవజన్య.

Praseodymium = ప్రాస్యుడిమము (ర).

Precipice = చరియ; ప్రపాతము.

Precipitate = అవక్షేపము; మడ్డిదిగుట (2) పతనము; దిగజారుట.

Predicables = అభిధేయములు.

Predicate = నిర్దేశము; విశేషణము; వ్యాపకము (తర్క).

Predication = కథనము.

Pregnancy = గర్భధారణము; గర్భిణీత్వము.

Premise, Premiss = పూర్వసిద్ధాంతము (2) ఆధారవాక్యము; అవయవములు.

Premium = ప్రీమియము; తోప్రుడు; అడితి; చెల్లించుపైకము.

Premolars = చీలిక పండ్లు.

Premonitary Symptoms = వ్యాధిపూర్వ గుణములు.

Preparation = సజ్జీకరణము.

Presbyopia = చత్వారము.

Prescription = చికిత్సాపత్రము; ఔషధయోగము.

Present worth = ప్రస్తుతమూల్యము; తత్కాలమదింపు.

Pressure = ఒత్తిడి; పీడనము.

Preserved foods = నిలువచేయబడిన తినుబండారములు.

Preventible diseases = నివారణయోగ్య వ్యాధులు.

Prickle = ముల్లుకరములు.

Prickly chaff = ఉత్తరేణి.

,, Pear = నాగజెముడు.

Primary Bow = మధ్య ధనుస్సు.

,, Peduncle = వృంతము.

,, Stem = ప్రకాండము; తల్లికొమ్మ; బోదె.

Principal = అసలు; మొదలు.

,, axis = ముఖ్యాక్షము.

,, Star = యోగతార.

Principle = నియమము; నీతిసూత్రము; సారబీజము.

,, of excluded middle = నిరాకృత మధ్యతాసూత్రము.

,, of identity = తదాత్మ్యతాసూత్రము; కేవలాన్వయి.

,, of sufficient reason = కారణ సంపూర్ణతాసూత్రము.

,, of work = కార్యసూత్రము.

Prion = ధరతుడు.

Prism = చదును పలకల (త్రికోణ)కడ్డి; (2) సమపార్శ్వము; పట్టకము.

,, excavation of the form of = సూచీఖాతము.

Probable duration of life = సామాన్య ఆయుర్దాయము.

Probability = సంభవమానము; సంభవనియత.

Probe = గాయపరిశోధన శలాక.

Problem = ప్రశ్న; ఉపపాద్యము; సమస్య; నిర్మాణము.

Process = ప్రవర్ధనకము; ప్రవర్ధనము; కూటము; కూటకము; (2) మార్గము; విధాయకము; విధానము.

Process, Acromion = అంసకూటము.

,, Alveolar = దంతోలూఖలిక ప్రవర్ధనకము.

,, Clinoid = గులికా ,,

,, Coracoid = అంసతుండ ,,

,, Coronoid = హనుకూటము ,,

,, Ethmoidal = ఝర్ఝరకూటకము; ఝర్ఝరప్రవర్ధనకము.

,, External angular = బహిఃకోటి ,,

,, Infra orbital = నేత్రాధరీయ ప్రవర్ధనకము.

,, Internal angular = అంతఃకోటి ,,

,, Jugular = మన్యాప్రవర్ధనకము.

,, Lachrymal = అశ్రువాహినీకూటకము.

,, Malar = గండధర కూటకము.

,, Mastoid = గోస్తన ప్రవర్ధనకము.

,, Nasal = నాసాకూటము.

,, Orbital = అపాంగ ప్రవర్ధనకము; నేత్రకోటర భూమిశృంగము.

,, Palate = తాలుఫలక ,,

,, Pterygoid = జతుకాస్థి చరణ ప్రవర్ధనకము.

,, Sphenoidal = జతుకాస్థి సంధాయి శృంగము.

,, Styloid = శిఖాప్రవర్ధనకము.

,, Trochanter major = ఊర్వస్థిసుమహాశిఖరక ప్రవర్ధనకము.

Process of thought = ఆలోచన క్రమము.

Produce a straight line = సరళరేఖగా పొడిగించు; దీర్ఘించు.

Product = లబ్ధము; గుణాకారలబ్ధము; గుణనఫలము.

,, Continued = వితతలబ్ధము; ఎడతెగని లబ్ధము; నిలువులేని లబ్ధము. అవిరామ లబ్ధము.

Product of variables of different natures = భావితము

,, Partial = భాగలబ్ధము.

Profit and Loss = లాభనష్టములు.

Profitless = లబ్ధిలేని; లాభములేని.

Prognosis = రోగగతిసూచన; రోగపునరుకను చెప్పుట; భవిష్యద్జ్ఞానము; సాధ్యాసాధ్యవిచారజ్ఞానము.

Progression = శ్రేణి; శ్రేఢి; మాలిక.

,, Arithmetic = సమాంతర (గణిత) శ్రేఢి.

,, Geometric = సమసంబంధి శ్రేఢి; సమనిష్పత్తి శ్రేఢి.

,, Harmonic = హరాత్మక శ్రేఢి; ఏకస్వన (సమస్వర) శ్రేఢి.

Project = విక్షేపించు; ప్రలంబించు.

Projectile = విసురుడుగుండు.

Projection = విక్షేపము; ప్రలంబము.

Projective = విక్షేపిత; ప్రలంబిత.

Prolapse = భ్రంశము; చ్యుతి; దిగజారుట.

,, of Anus = గుదభ్రంశము; అంగపాతము.

,, Gut = పేగుజారుట.

,, Uteri = గర్భాశయభ్రంశము.

Prong = ముల్లుకోల; శూలము.

Proof = రుజువు; నిరూపణము; ఉపపత్తి; ప్రమాణీకరణము.

,, Analytical = విభాజకనిరూపణము; అన్వయనిరూపణము.

,, Indirect = విపరీతసిద్ధభావ నిరూపణము; కుటిలప్రచుర నిరూపణము; పరోక్షనిరూపణము.

,, Inductive = ఉదాహరణానుమిత సిద్ధాంతము.

,, Theoretical = శాస్త్రీయ నిరూపణము.

Propeller = ముందుకు త్రోయునది; నడుపునది.

Propernames = నామవాచకములు.

Property = ధర్మము; సొత్తు; ధనము.

Propagation of light = కాంతిప్రసరణము.

Proportion = సంబంధ సామ్యము; యుగ్మనిష్పత్తి; అనుపాతము.

,, continued = అవిచ్ఛిన్న సంబంధసామ్యము.

,, direct = సమసంబంధసామ్యము; అనులోమసంబంధ సామ్యము; అనులోమానుపాతము.

Proportion, Inverse = విలోమసంబంధసామ్యము; విలోమానుపాతము.

,, reciprocal = పరస్పరసంబంధ సామ్యము; పరస్పసంబంధాను పాతము.

Proportional = సంబంధసామ్యముగల; అనుపాతముగల; విలోమానుపాత ధనము.

mean = అనుపాతమధ్యము.

,, fourth = అనుపాతచతుర్థము.

Proposition = ఆకాంక్షా సిద్ధాంతము; ఉపపాద్యము; ప్రమేయము; సాధ్యప్రతిజ్ఞ (2) వాక్యము; ప్రతిజ్ఞ.

Proprium = సామాన్యలక్షణము.

Prostrate gland = శుక్రాశయపిండము.

Prostration = శక్తిపాతము.

Prostratitis enlargement = అష్ఠీలా.

Protective colouration = సంరక్షకవర్ణము.

Proteids = మాంసకృత్తులు.

Protonema = ప్రథమతంతువు.

Proton = పరమాణుకణము; ధనవిద్యుత్కణము.

Protoplasm = జీవపదార్థము; మూలపదార్థము; రంగులేని సూక్ష్మమైన ఆదిమ పదార్థము.
Protozoa = స్వతంత్రకణవంతములు; మూలరూపప్రాణులు.
Protractile tongue = సాగుడునాలుక.
Protractor = కోణమాని.
Prunes = అల్బకారా.
Pruning = ఛేదనము; కత్తిరించుట.
Pruritis = గుదమునందు తీట.
,, vulvar = యోనికండూతి.
Prussian blue = ప్రష్యానీలము.
Psoriasis = విచర్చిక చర్మరోగము.
Psychology = మానసశాస్త్రము; మనోతత్వశాస్త్రము.
Ptyalin = లాలా శర్కరికము.
Pubis = భగాస్థి.
,, Body of = భగపీఠము; లింగపీఠము.
,, Ascending Ramus of = భగాస్థి ఉత్తరశృంగము.
,, Descending ,, ,, = భగాస్థి అధారశృంగము.
Public Health = ప్రజారోగ్యము.
,, ,, Survey = ప్రజారోగ్య విచారణ; ఆజ్మాయిషీ.
Public Health & Hygiene = ప్రజారోగ్యము, ఆరోగ్యశాస్త్రము.
Pudding = పిండివంట.
Pudding pipe tree = రేలచెట్టు.
Pulley = కప్పి; గిలక.
Pulmonary = పుప్పుసాభిగము; పుప్పుసీయము.
,, Artery = పుప్పుసధమని.
,, Veins = పుప్పుసోర్ధసిర; పుప్పుససిర.

Pulp of teeth = నోటిపండ్లలోని మెత్తని పదార్థము.

Pulsation = ధాతువు.

Pulse = నాడి (2) కాయధాన్యము.

Pumelo = పంపనపనస.

Puncture = ఛిద్రము; చిల్లు.

,, Wound = చిల్లుపడిన గాయము.

Pupil of the eye = కంటిపాప.

Purchase and Sale = క్రయ విక్రయములు.

Purgatives = రేచకములు; భేదిమందులు; విరేచనకారులు.

Puerperal fever = ప్రసూతిజ్వరము; బాలెంతజ్వరము; సూతికాజ్వరము.

Pure spectrum = స్వచ్ఛమగు కిరణ పృథక్కరణము.

,, Syllogism = కేవలన్యాయము.

Purpose = ప్రయోజనము.

Pus = చీము.

Putamen = (పండ్లలోని గట్టి) గింజ.

Putrid = పూతి; మురిగిన; కుళ్ళిన.

Putrifaction = మురుగుట; చీకుట; కుళ్లుట.

Pylorus = అంత్రిముఖము.

Pyorrhea = క్రిమిదంతము; పండ్ల చీము.

Pyramid = బహుభుజగోపురము; సూచ్యాగ్ర స్తంభము.

Pyro phosphoric acid = మధ్యస్ఫురికామ్లము.

Pyro sulphates = పరిగంధకితములు.

Pyro sulphuric acid = మధ్యగంధకికామ్లము.

Python = పైతను అను కొండ చిలువ.

## Q

Quack = కపటవైద్యుడు; కృత్రిమవైద్యుడు. కువైద్యుడు.

Quadrangle = అంకణము; చతుష్కోణము.

Quadrant = చతుర్థభాగము; వృత్తపాదము.

Quadrant, Even = ఓజపదాంతము.

,, Odd = విషమపదాంతము.

Quadranture = పదసంస్థానము.

Quadrilateral = చతురస్రము; చతుఃపార్శ్వము; చతుర్భుజము.

Quadrupeds = చతుష్పాదములు.

Quadruple = చతుర్గుణము; నాలుగంతలు.

Qualitative = గుణప్రధాన.

,, Composition = గుణసంఘట్టనము.

Quality of the proposition = వాక్యగుణము.

Quantitative Composition = పరిమాణ సంఘట్టనము.

Quantity = పరిమాణము; రాశి.

,, of the proposition = వాక్యరాశి.

Quantum = పరిమాణము.

,, Theory = తేజఃకణవాదము.

Quarantine = సంసర్గనిషేధము.

Quarry = ఖని; గని; కొండత్రవ్వుట.

Quartz = శిలాస్ఫటికము.

Quarter = పావు; చతుర్థభాగము.

Quick lime = పొడిసున్నము.

Quindecagon = పంచదశభుజము.

Quinine = క్వైనా.

Quorum = నిర్దిష్టసంఖ్య; పూరకసంఖ్య.

Quotation = కొలపుధర.

Quotidian = దైనందినము; అన్యేద్యుష్కము.

Quotient = లబ్ధి; భేదము; విభజనఫలము; భాగహారలబ్ధము; భాగఫలము.

## R

Rabbit = సీమకుందేలు.

Raceme = గెల; (2) మధ్యాభిసరణ.

Racemose = శతపత్రి; మధ్యాభిసారి.

Radial = వ్యాసార సంబంధమైన.

Radicle = ప్రథమమూలము; వేరుమొన.

Radian = త్రిజ్యాకోణము.

,, Measure = త్రైజ్యకోణమానము.

Radiation = కిరణ విసర్జనము; ప్రసరణము; ప్రచారము; కేంద్రోత్సర్జనము.

,, of Electric heat = విద్యుదుష్ణప్రసరణ.

,, of Electro Magnetism = విద్యుత్ చుంబకప్రసరణ.

,, of heat = ఉష్ణప్రచారము.

,, of Light Rays = తేజఃకిరణప్రసరణ.

,, of Vibration of Electrons = అణీయఃకంపనప్రసరణ.

,, of X rays = రాంజనకిరణప్రసరణ.

Radiator = ఉష్ణవిసర్జకయంత్రము; లోపలవేడిరొక్కి దానిని చుట్టు ప్రక్కలకు ప్రసరింపజేయు లోహసాధనము.

Radical = మూలసంబంధి.

,, axis = సంపాతాక్షము.

Radio, Active = క్ష కిరణవిసర్జనము.

Radiograph = క్ష కిరణలేఖనము.

Radio meter = కిరణభారదర్శకము.

Radio phone = ఉష్ణతాధ్వనియంత్రము.

Radio Set = రేడియోసెట్టు. విద్యుత్ చుంబకతరంగములద్వారా ఆకసమున ప్రసరింపజేయబడినధ్వనితరంగములను మరల గ్రహించి వానిని యథాస్వరూపములో వినుట కుపయోగించు విద్యుత్ యంత్రము. See Wireless.

Radish = ముల్లంగి.

Radium = రదము (ర)

Radius = మణిబంధాధారాస్థి; ప్రకోష్ఠాస్థి (2) వ్యాసార్ధము, త్రిజ్య.

„ circum = పరిత్రిజ్య.

„ in = అంతస్త్రిజ్య.

„ of curvature = వంపుయొక్క భుజము.

Radix = మూలసంఖ్య; మూలము.

Rainbow = ఇంద్రధనుస్సు.

Rain gauge = వర్ష మితి, వర్ష మాపకము.

Raisin = కిస్మిస్.

Raman Effect = రామనుపరిశోధన; అణురచనలోను కిరణప్రసరణములోను సి. వి. రామనుగారు చేసిన నూతనపరిశోధన.

Range = సంచారము; మేర; రంగస్థానము; (2) పంక్తి; శ్రేణి.

Rangoon creeper = గారీమనోహారి.

Rarefaction = విరళీకరణము.

Rarer media = అల్పతరయానము.

Rasp = పెద్దఆకురాయి.

Rate = చొప్పు; ప్రమాణము; మానము; రేటు

Ratio = సంబంధము; నిష్పత్తి; రెండుసంఖ్యలకుగల సంబంధము.

„ arithmetical = సమాంతరసంబంధము, నిష్పత్తి.

Ratio, Constant = నిరంతరసంబంధము.

,, Direct = సమసంబంధము; అనులోమనిష్పత్తి.

,, Duplicate = వర్గసంబంధము, నిష్పత్తి.

,, Extreme and mean = అంత్యమధ్య సంబంధము, నిష్పత్తి.

,, Geometrical = సమగుణక సంబంధము, నిష్పత్తి.

,, Inverse = విలోమ సంబంధము.

Rational = మూలసంజ్ఞరహిత; అకరణీమగత.

Rationale = న్యాయావలోకనము.

Rattan = పేపబెత్తము.

Ravine = కోన; ఇరుకుకొండకనుమ.

Ray = కిరణము.

Re-action = ప్రతీకరణము; సంఘట్టనము; ప్రతిక్రియ.

Ready reckoner = త్వరగణనసాధనము.

Re-agent = ప్రతికారి.

Reason = హేతువు; కారణము.

Reasoning = అనుమానము; (తర్కం)

,, aposteriori = శేషవదనుమానము.

,, apriori = పూర్వవదనుమానము.

,, in a circle = చక్రకము.

,, inductive = ఉదాహరణానుమిత సిద్ధాంతము.

Recantation = తేల్చుట; నిరాకరించుట.

Receiver = గ్రాహకము; గ్రాహకయంత్రము.

Reciprocal = అన్యోన్య; పరస్పర.

Reclamation = ఉద్ధరణము.

Reconciliation = పునర్ఘటనము.

Rectal injection = మలమార్గద్వారా పిచికారి.
Rectangle = దీర్ఘచతురస్రము; ఆయతము.
Rectangular = దీర్ఘచతురస్రరూప; ఆయత.
Rectilineal = సమరేఖావృత; సరళరేఖాత్మక.
Rectilinear = వంకరలేని; సరళరేఖావిశిష్టమైన.
Rectum = పురీషనాళము; గుదనాళిక.
Recur = తిరుగవచ్చు; పునరావృత్తి.
Recurring Decimal = ఆవర్తదశమాంశము.
Red corpuscles = ఎఱ్ఱ (రక్త) కణములు.
Red custard apple = రామాఫలము.
Red Litmus = ఎర్రలిట్మసు.
Red orpiment = మణిశిల.
Red oxide of lead = గంగసిందూరము.
,, of mercury = రససిందూరము.
Red sanders = రక్తచందనము.
Red Sorella = పుల్లగోంగూర.
Reduce = సంగ్రహించు; తగ్గించు; మార్చు.
Reducing agent = అమ్లజనిహారిణి.
Reduction = సంగ్రహణము; మార్చుట; లఘూకరణము (2) అపచయము.
,, of equation = జాతీకరణము; సమీకరణగణక్షయము; సమీకరణ లఘూకరణము.
Reductio ad absurdum = దోషప్రకటనాత్మక నిరూపణము.
Reefs = తీరమునందలి కొండ గుట్టలు.
Reflection = పరావర్తనము; ప్రతిఫలనము.
,, Irregular = వక్రపరావర్తనము.
,, Regular = క్రమ ,,

Reflected ray = ప్రతిబింబరేఖ.

Reflector = దర్పణము; పరావర్తకము.

Reflex action = ప్రతీకారచర్య; ప్రతిఫలచర్య.

Refracted ray = వక్రీభవన కిరణము; వక్రీభూతకిరణము.

Refraction = వక్రీభవనము.

,, of rays = కిరణ వక్రీభావము.

Refractive index = వక్రీభవనగణకము.

Refrangibility = వంగుట.

Refrigeration = శీతోపచారక్రియ; చల్లబరచుట.

Refrigerator = పదార్థములను చల్లబరచి నిలువచేయు యంత్రము.

Refuse = చెత్త; (వ్యర్థ) పదార్థము.

Regular = క్రమ; సమ; భుజకోణసమత్వముగల.

Regulator = యంత్రగతిని సరిజేయుసాధనము.

Rejuvenation = నవయౌవనీకరణము.

Relapse = (రోగము) తిరుగబెట్టుట.

Relapsing fever = పరివర్తిజ్వరము.

Relative = అపేక్షిత; సాపేక్షక.

Relative Density = తారతమ్యసాంద్రత.

,, error = సాంబంధికప్రమాదము; తారతమ్యదోషము.

,, Terms = ససంబంధికపదములు.

Relativity = సాపేక్షత్వము; సాపేక్షసంబంధత; పరస్పర సంబంధ
సాపేక్షదృష్టి.

Remainder = శేషము; మిగత.

Remittent = నడుమనడుమ హెచ్చుచుతగ్గుచునుండు.

,, fever = సంతతజ్వరము.

Renal = వృక్క సంబంధ; మూత్రపిండసంబంధ.

Representation = ప్రదర్శనము; ఆకారము; ప్రాతినిధ్యము.

Representative = ప్రతినిధి.

Reproduction = పిల్లలుపెట్టుట; సంతానోత్పత్తి.

Reptiles = ఉరోగామి ప్రాణులు; ప్రాకునట్టివి; సరీసృపములు.

Repulsion = విముఖత్వము.

Reservoir = జలాశయము; తొట్టి.

Residue = శేషము; మిగులు.

Resin = గుగ్గిలము; అరపూస; సజ్జాకారము.

Resolution = లబ్ధమూలముల విభజనము; విశ్లేషణము

Resolve = విడదీయుట; విభజించుట.

Resonance = అనువాదిత్వము.

Respiration = శ్వసించుట; ఉచ్ఛ్వాసనిశ్వాసములు.

Restaurant = ఉపహారగృహము; ఫలాహారశాల.

Resting point = విరామస్థలము.

Result = ఫలము; Resultant = ఫలితప్రేరణ.

Retarded velocity = క్షీయమాణవేగము.

Retention of urine = మూత్రావరోధము.

Retina = అంతఃపటలము; అక్షికము.

Retinitis = అంతఃపటలదాహము.

Reticulate = జలాకారము; వలయల్లిక వంటి.

Retort = బకయంత్రము.

Retractile claws = ముడుచుకొను నఖములు.

Reverse = విపరీతము: త్రిప్పివేయు; ముందు వెనుకలగు.

Reversible = త్రిప్పివేయదగిన; వచ్చినమార్గమే తిరిగిపోగల.

,, Reaction = ద్విగతి సంఘట్టనము.

Revolution = భ్రమణము; చుట్టుతిరుగుట.

Rheumatism = ఆమవాతము; కీళ్లవాతము.

Rhinoceros = ఖడ్గమృగము.

Rhizoid = నులివేరు; మూలతంతువు.

Rhizome = నేలగొమ్మ; మూలవేరు.

Rhodium = హ్రిదము (ర).

Rhombus = వాలిన సమచతుర్భుజము.

Rhubarb = రేవలచిన్ని.

Ribs = ప్రక్కయెముకలు; పర్శ్వులు.

Ricinus = ఆముదపు చెట్టు.

Rickets = అస్థిమార్దవరోగము.

Ridges = గట్లు; మిట్టలు.

Right angle = సమకోణము.

Right ascention = విషువాంశము.

Rigour = ఖండితము.

Rigor mortis = మరణ సంకోచము.

Rind = (కాయలు, పండ్లు, మొ॥ వాని) తొక్క; పైతోలు.

Rinder pest = కింక.

Ringworm = తామర; దమ్రి.

,, Shrub = మెట్టతామర.

Ripple = చిరియల.

Rock crystal = శిలాస్ఫటికము.

Rock oil = శిలాతైలము.
Rollers = దొడుపులు.
Rontgen rays; (X rays) = రాంజనకిరణములు; విద్యుత్ జన్య ప్రకాశ కిరణములు; క్ష కిరణములు.
Root = మూలము; ఘాతమూలము; సామ్యమూలము.
Root, cube = ఘనమూలము.
,, Extraneous = అన్యసామ్యమూలము.
,, Fourth = చతుర్మూలము.
,, Imaginary = భావనాసామ్య మూలము.
,, Irrational = అరాశిక సామ్యమూలము.
,, Real = నిజసామ్యమూలము.
,, Rational = రాశిక సామ్యమూలము.
,, Square = వర్గమూలము.
Root-cap = వేరుబుఱ.
Rootlet = ప్రక్క వేరు.
Root nodule = వేరుగుంట్లు; వేరుకణుపులు.
Rose apple = అల్లనేరేడు.
,, Malloes = శిలారసము.
Roselle = గోగు; తమరతచెట్టు.
Rose wood = నూకమాను.
Rotary machine = రోటరీ (చక్రగతి) యంత్రము.
Rotary motion = చక్రగతి.
Rotation = పరిభ్రమణము; చక్రగతి; పరిక్రమణము.
,, of earth = భూభ్రమణము.
Rotation of crops = సస్యపరివర్తనము.
Rotund = వర్తుల.

**Round** = గుండ్రము.

,, Zeodary = కచ్చూరము.

**Rousa grass** = కామంచి గడ్డి.

Rubber Cork = రబ్బరు బిరడా.

Rubidium = రూపదము (ర).

Rudiments = ప్రథమాంగములు.

Rules = రూళ్లు; పంక్తులు; నిబంధనలు.

Rule of three = త్రైరాశికము.

,, Double = పాంచరాశికము.

,, Inverse = వ్యస్తత్రైరాశికము.

,, Second term demand or requisition = ఇచ్ఛ.

,, Third term = ఫలము.

,, Fourth term = ఇచ్ఛాఫలము.

Rum = రమ్ము; సారాయి.

Ruminate = నెమరువేయు.

Russet viper = రక్తపాడపాము.

**Rust** = తుప్పు.

Ruthenium = రుథేనము.

## S

Saccharine = శాఖరైను చక్కెర.

Sacral region = త్రికాస్థిప్రదేశము.

Sacrum = త్రికాస్థి.

Safety lamp = భద్రదీపము.

Saffron = కుంకుమ పువ్వు; కేసరి.

Sagitta = శరము.

Sagittarii = ఉత్తరాషాఢ.

Sagittarius = ధనుస్సు.

Sagittate = బాణాగ్రాకారము.

Salad = పచ్చడివంటి పదార్థము; పచ్చికూరగాయలతో చేసినది.

Salammoniac = నవాసాగరము.

Sale, retail = చిల్లర బేరము; అమ్మకము.

,, Whole sale = టోకు బేరము.

Saliva = ఉమ్మినీరు; లాలా జలము.

Salivary glands = ఉమ్మినీటి గ్రంధులు; లాలా గ్రంధులు.

Salivation = ఉమ్మి ఊరుట; లాలాస్రావము.

Salpingitis = నాళికాదాహము; స్రోతదాహము; స్త్రీబీజములు గర్భాశయములోనికి పోవునాళపువాపు.

Salt = లవణము.

,, of ammonia = నవాసాగరము.

Salt petre = సూరేకారము; పెట్లుప్పు.

Salve = లేపనము; గాయములకు పూయుమందు.

Samara = సపక్షఫలజాతి; రెక్కల గింజలు.

Sanitorium = ఆరోగ్య (రక్షణ) స్థానము.

Sanitation = పారిశుద్ధ్యము; శౌచము; ఆరోగ్యరక్షణము.

Sanitary Laws = శౌచవిధులు; ఆరోగ్యరక్షణోపాయములు.

Santonine = పాములమందు; నులిపురుగులమందు.

Sap = రసము; సారము; పిండరసము.

Saphire = నీలము.

Sapraemia = పూయజన్యతాపము.

Saprophytic nutrition = పూతికాహారము.

Sarcoma = సార్కోమా; నెత్తురుగడ్డవ్యాధి; మాంసార్బుదము.

Sarcosis = నెత్తురుగడ్డ; కంతి; మాంసార్బుదము.

Sardonyx = గోమేధికము.

Sarsaparilla = సుగంధిపాల.

Saturated Solution = సంపూర్ణద్రావణము.

Saturn = శని.

Sauce = నంజుకొను వ్యంజనము; పులుసు; పచ్చడి మొ॥

Scaleres = గజ్జి.

Scale = త్రాసు; త్రాసుతట్టు; (2) పరిమాణపుగీత; కొలబద్ద; కొలమానము (3) ప్రమాణము; మానము; పరిమాణము; (4) పొరలు; వల్కలములు; పొలుసు; (5) పక్కు; కురువుపైన ఎండినపక్కు.

Scale, Diagonal = కర్ణకొలతబద్ద.

„ Drawn to = పరిమాణము ప్రకారము గీయబడిన.

„ Reduction to = పరిమాణమునకు తగ్గించుట; పరిమాణసంక్షేపము.

Scale pans = త్రాసుయొక్క పళ్లెములు.

Scalene triangle = అసమభుజత్రిభుజము.

Scalpel = శస్త్రవైద్యునికత్తి; చాకు.

Scandium = స్కాందము (ర).

Scapula = అంసఫలకము; రెక్కయెముక.

Scaraboeus = పేడపురుగు.

Scarp = నిట్టనిలువు; ఏటవాలు; కోసుచరియ.

Scateriform = నిచ్చెనమెట్లవంటి.

Scattering of light = వెలుతురును చిందచేయుట; తేజో వికరణత; తేజో విక్షిప్తత.

Scenery = దృశ్యపరిస్థితి.

Sciatica = కటినొప్పి; తుంటి నొప్పి; గృధ్రసీవాతము; జంఘాపృష్ఠశూల; గృధ్రసీనాడి దాహము.

Science = శాస్త్రవిజ్ఞానము.

,, Applied = వ్యవహారోపయుక్త శాస్త్రము.

,, Pure = కేవల(?) శాస్త్రము; తాత్త్విక శాస్త్రము.

Scientific deductive method = ప్రతిజ్ఞావాదము.

,, inductive method = ఉదాహరణవాదము.

,, nomenclature = శాస్త్రపరిభాష.

,, testimony = శాస్త్రప్రమాణము.

Sclera = కంటిగుడ్డుపైనుండు తెల్లనిపొర; అక్షిబాహ్యపటలము.

Sclerenchyma = దృఢసారము; దృఢకణసంహతి.

Sclerotica = నేత్రబాహ్యపటలము; తెల్లగుడ్డు.

Scoliosis = మణిస్తంభనమనము; వెన్నెముక ప్రక్కవంపు.

Scolopendra = జెఱ్ఱిజాతి.

Scoop = వంపు.

Scope = అవకాశము; మండలము.

Score = ఇరువది; వింశతి.

Scoria = లోహపుచిట్టెము

Scorpio = వృశ్చికరాశి.

Scorpionis = మూల; జ్యేష్ఠ; అనూరాధ.

Screen = తెర.

Screw = మరమేకు; చీల.

Scrofula = గండమాలాజనకరక్తవికారము; అపచిగండమాల.

Scrotum = అండకోశము.

Scrub jungle = పొదల అడవి; చిట్టడవి

Scum = పైని తేలెడు మలినము; తెట్టు.

Scurvy = శీతాదము; లవణ రక్తవ్యాధి.

Scythe = వంకరకత్తి; కొడవలి.

Sea-breeze = సముద్రమారుతము.

Sea-level = సముద్రపు మట్టము.

Sea-plane = సముద్ర విమానము.

Sea-sickness = సముద్రయాన వికారము.

Sea-weed = సముద్రపు పాచి; శైవలము.

Seal = సీల్ అను క్రూర జలచరము.

Search light = అన్వేషణ జ్యోతి.

Seasons = ఋతువులు.

Sebaceous glands = రోమకూపములు; త్వక్స్నేహోత్పాదక గ్రంథులు.

Sebasten = పెద్ద నక్కెరు.

Second = వికల; సెకను

Secondary = అప్రధాన.

,, Bow = ఉపధనుస్సు.

,, Growth = పునర్వృద్ధి.

,, Nucleus = ఉపజీవ స్థానము.

,, Peduncle = ఉపవృంతము.

,, Stem = ఉపకాండము; పిల్లకొమ్మ; ఉపశాఖ.

Secretion = గ్రంధిజనిత స్రావము; ఊట; అంతరోత్సర్జన; ఉత్సృజనము; గ్రంధులలో ఊరురసము.

Secretory organs = స్రావకావయవములు; అంతరోత్సర్జకావయవములు.

Section = ఖండము; బద్ద; ఛేదము; సంపాతము.

Cross = అడ్డ; బద్ద; తిర్యక్ఛేదము.

Sector = అరాంతరము; ద్విత్రిజ్యము.

Sadative = ఉపశమనౌషధము.

Sediment = మడ్డి; గసి; మష్టు.

Sedge = జమ్ము.

Seed coat = గింజపొట్టు.

,, Pod = కాయ.

Segment = ఖండము; వృత్తఖండము.

,, of a circle = చాపక్షేత్రము.

,, alternate = ఒండు విడిచిన చాపక్షేత్రము; ఏకాంతర ఖండము.

Segmentation of apical cell = అంత్యకణఖండనము.

Seismograph = భూకంపగ్రాహక యంత్రము.

Seismology = భూకంపశాస్త్రము.

Self contradiction = స్వవచన వ్యాఘాతము.

Self dependence = ఆత్మాశ్రయము.

Self fertilisation = స్వసంయోగము.

Self fertilising gamete = స్వసంయోగి.

Self luminous = స్వయంప్రకాశి.

Self pollination = ఆత్మపరాగ సంపర్కము.

Selenium = సోమము (ర)

Semen = శుక్రము.

**Semi-circular canals** = అర్ధవలయనాళములు.

**Semi-colon** = అర్ధబిందువు ';'

**Semi-lunar valve** = అర్ధచంద్ర పిధానము; అర్ధేందు కవాటము.

**Sensation** = నిర్వికల్పజ్ఞానము; భావన; ఇంద్రియ వికారము.

**Sense of hearing** = శ్రవణేంద్రియము.

,, **Sight** = చక్షురింద్రియము.

,, **Smell** = ఘ్రాణేంద్రియము.

,, **Taste** = రసేంద్రియము; జిహ్వేంద్రియము.

,, **Touch** = స్పర్శేంద్రియము; త్వగింద్రియము.

**Sense organs** = జ్ఞానేంద్రియములు.

**Sensibility** = ఇంద్రియ గోచరత; సూక్ష్మగ్రాహ్యత.

**Sensory nerves** = స్పర్శనాడులు; జ్ఞాననాడులు.

**Sepals** = సంరక్షక పత్రములు.

**Separating funnel** = విడదీయు గరాటు.

**Sepsis** = క్రిమిజన్య విషదోషము; రోగవిషము; రక్తగత విషదోషము; వ్రణవిషము; వ్రణపూయవిషదోషము.

**Septic** = పూయయుక్త; పూయవిష; రోగవిష సంబంధ; రక్తగతవిష దోష.

**Septic tank** = కలుష జలతటాకము; విషజలతటాకము.

**Septicidal** = భిత్తిచ్ఛేదక (బీజ).

**Septum** = ముక్కురములను వేరుపరచు గోడ.

**Sequence** = క్రమము.

**Series** = శ్రేణి; శ్రేఢి; మాల; క్రమము; పరంపర.

,, **Ascending** = ఆరోహణశ్రేణి; ఉచ్ఛశ్రేణి.

,, **Convergent** = పరిచ్ఛిన్నశ్రేణి.

Series Descending = అవరోహణశ్రేణి.
,, Divergent = అపసృతశ్రేణి.
,, Infinite = అనంతశ్రేణి.
Serius = మృగవ్యాధుడు (జ్యోతి).
Serpenis = సర్పము.
Serpentaurius = భుజగధారి.
Serrate = క్రకచచ్ఛదము; రంపపు పళ్లుగల.
Serum = రసి; వస.
Sesame = నువ్వులు.
Setal = చిన్నముండ్లు.
Set square = మూలమట్టము.
Seville orange = నారదబ్బ.
Sewage = మురుగు.
Sexagesimal = షష్టిగుణితమైన; షష్ట్యంశగుణిత.
Shadows = నీడలు; ఛాయలు.
Shaft = కాండము.
Shark = మరచేప; సొఱచేప.
Sharp angled cucumber or gourd = బీరకాయ.
Sheath = ఒఱ; పిధానము.
Shoal = లోతులేని; మెఱక; గాధము.
Shooting Stars = ఉల్కలు.
Shoot System = ప్రకాండ వ్యూహము.
Short sight = హ్రస్వదృష్టి.
Shoulder = భుజము.
,, Joint = భుజసంధి; భుజపుకీలు.

Shrubs = తుప్పలు.

Sialogogue = అధికముగా ఉమ్మిఊరచేయుమందు.

Side = ప్రక్క-భుజము; పార్శ్వము.

Siderial Day = నక్షత్రదినము.

Side ways pressure = తిర్యక్పీడన.

Sieve tubes = జల్లెడకాలువలు; త్వగ్వాహికలు.

Sight = దృష్టి.

Sight, Short = సమీపదృష్టి; హ్రస్వదృష్టి.

Sight, Long = చత్వారము.

Signal = గుఱుతు; Sign = గుఱుతు. చిహ్నము.

Significant = సార్థక; ముఖ్య; విశేష.

,, individual names = సాభిప్రాయైకవ్యక్తివాచకములు.

Signs of the zodiac = రాశిచక్రము.

Silicates = శైలికములు.

Silicon dioxide = శైలద్వ్యమ్లజనిదము.

Silk cotton = బూరుగు దూది.

Silver nitrate = రజతనత్రితము.

Similar = సమరూప; సజాతీయ; సరూప.

,, inversely = విపరీతసమరూప.

Similarity = సారూప్యత.

Similitude = సాజాత్యము.

Simple constructive = కేవలస్థాపనము; కల్పనాలాఘవము (తర్క.)

Simple cyme = సాధారణ మధ్యారంభి.

,, Machine = మూల యంత్రము.

,, Observation = కేవల పరిశీలనము (తర్క.).

Simplify = సూక్ష్మీకరించు; సూక్ష్మము చేయు.
Simple leaves = లఘుపత్రములు.
,, Nitrates = లఘునత్రితములు.
Sine = భుజజ్యా.
,, inversed = ఉత్క్రమజ్యా.
Sinew = స్నాయువు.
Sinus = నాడీవ్రణము: సిరాపరిఖ.
Size = పరిమాణము; ఆకారము; ప్రమాణము.
Skeleton = అస్థిపంజరము; కంకాళము; ఎముకలగూడు.
Sketch = రూపరేఖ; ఆకారలేఖనము; స్థూలదర్శనము; రేఖాచిత్రము.
Skin = చర్మము; త్వక్కు.
Skull = కపాలము; తలపుఱ్ఱె.
Slag = లోహపుచిట్టెము; మలినము.
Slaked lime = తడిసున్నము.
Sleep-orchid = పాలామిశ్రి.
Sleet = తుషారము; తుషారవృష్టి; మంచువాన.
Slide-rule = జారుడుచట్టము.
Slope = ఏటవాలు.
Small caltrop = పల్లేరు.
,, circles = లఘువలయములు.
Intestines = చిన్నప్రేగు; సూక్ష్మాంత్రము.
,, Muscles = లఘుమాంసపేశులు; స్నాయువులు.
Small pox = పెద్దమ్మవారు; మసూరిక.
Smelling salts = అఘ్రాణించుటకు ఘాటువాసనగల లవణములు; అమ్మోనియాకర్బనితము.

Smelting = కరగుట.

Snake gourd = పొట్లకాయ.

Snail = నత్త.

Snant = ముట్టె; ముక్కు.

Snow line = హిమరేఖ.

Soap-stone = బలపపురాయి; పిండిరాయి.

Sociology = సాంఘిక శాస్త్రము.

Soda = చవుడు; సోడా ఉప్పు.

Soda Carbonate = సోడియ కర్బనితము.

Soda, Impure Carbonate = సజ్జాక్షారము.

Sodium Amalgam = సోడియ పారదసమ్మేళనము.

Sodium Carbonate = సోడియ కర్బనితము; సోడా ఉప్పు.

Sodium Chloride = ఉప్పు.

Sodium Phosphite = సోడియస్ఫురాయితము.

Soft water = నిర్ఖటికజలము.

Soil = నేల.

Solar day = సౌరదినము.

Solar system = సూర్యగ్రహమండలి.

Solstice = అయనము.

Solid = ఘన; ఘనరూపము; ఘనపదార్థము.

,, State = ఘనరూపము.

Solubility = సంపూర్ణద్రావణశక్తి; కరగుగుణము.

Solution = ద్రవీకరణము; ద్రావకరసము; ద్రావణము.

Solvent = ద్రవకారక; ద్రావకము; కరగించు ద్రవము.

Soot = మసి.

Sorites = న్యాయబంధము.

Sorrel = చుక్కాకు. Sorrel Indian = పులిచింత.

Sound = ధ్వని.

Sound-wave = ధ్వనితరంగము.

Sounding line = లోతునుకొలుచు త్రాడు.

Soup = పులుసు; అంబలి.

Sovereign = నవరసు; సవరను; కాను.

Space = అవకాశము; ఎడము; అంతరము; బయలు; చోటు.

Span = జేన; అర్ధమూర; అవక్రప్రమాణము.

Spark = తేజఃకణము; విద్యుద్విస్ఫులింగము.

Spasm = స్నాయువులయీడుపు.

Spathe = (తాడిచెట్టులోనగువాని) మొవ్వ.

Spawn = చేపలగుడ్లు; మీనాండము.

Species = అంతర్జాతి; ఉపజాతి; తెగ.

Specific gravity = తారతమ్యగరిమ.

,, heat = తారతమ్యోష్ణము.

Spectacle mark = విష్ణుపాదము.

Spectro meter = కిరణ పృథక్కరణమానము; విచ్ఛిన్నకిరణమాపకము.

Spectroscope = సప్తవర్ణదర్శిని; విచ్ఛిన్నకిరణదర్శిని.

Spectrum = విచ్ఛిన్నకిరణము; చిత్రవర్ణము; సప్తవర్ణపట్టిక; దృశ్యప్రతిమ.

Spectrum absorption = అపశోషిత విచ్ఛిన్నకిరణము.

,, Chromatic = సవర్ణ విచ్ఛిన్నకిరణము.

,, Continuous = అఖండ విచ్ఛిన్నకిరణము.

Speed = వేగము; గతి.

Sperm-cell = సూక్ష్మబీజ కణము; శుక్రగోళకము.

**Spermary** = సూక్ష్మబీజాశయము; శుక్రాశయము.
**Spermatic filament** = బీజతంతువు; శుక్రతంతువు.
**Spermatorrhoea** = వీర్యస్రావము; వీర్యనష్టము; శుక్రమేహము.
**Sphere** = గోళము; ఉండ; మండలము.
,, of influence = ప్రభావప్రదేశము.
**Spherical** = గోళాకార; ఉండగా నుండు.
,, Surface = గోళాకార ఉపరిభాగము.
**Spica** = చిత్ర.
**Spinal** = పృష్ఠవంశీయ; పృష్ఠవంశగత.
**Spinal Canal** = పృష్ఠవంశనాళిక.
**Spinal Cord, Chord** = మజ్జారజ్జువు; వెన్నుపాము; సుషుమ్నానాడి; కశేరుక నాడి.
,, Column = వెన్నెముక; వీణాదండము; వంశము.
**Spine** = కణిక; ముల్లు; కంటకపత్రము (2) వెన్నెముక; కశేరుకము; పృష్ఠవంశము; మణిస్తంభము;
,, Concussion of the = పృష్ఠవంశ మాంద్యము.
,, Foramen = మణిరంధ్రము.
**Spinous process** = (కశేరుక) కొంకులు.
**Spingles** = దురద; దద్దురులు.
**Spiral** = శంఖాకృతి; సర్పిల.
,, arrangement = సర్పప్రసారము; మెలికలు దిరుగు.
**Spirogyra** = పసిరిక పాకు.
**Spirillum** = సూక్ష్మ వ్యాళరేఖ.
**Spirit Lamp** = స్పిరిటు దీపము.
,, Level = సారామట్టపు యంత్రము; స్పిరిటుమట్టము.

Spleen = ప్లీహము.

" Affections = ప్లీహ రోగములు.

" Enlargement = ప్లీహోదరము.

Sponge = స్పంజి; నీటినిపీల్చు పదార్థము.

Spontaneously = తమంతటతాము; సహజ.

Spoon = చంచా.

Sporangium = సిద్ధబీజాశయము; బీజకణకోశము.

Spore = సిద్ధబీజము; బీజకణము.

" Mother cell = సిద్ధబీజమాతృక.

Spout = ఎగజిమ్ముధార.

Sprain = బెణుకు.

Spray = తుషార యంత్రము.

Spring balance = తీగె త్రాసు.

" Water = ఊటనీరు.

Sprume = గ్రహణి.

Squall = గాలివాన.

Square = చతురస్రము; చదరము; సమచతుర్భుజము; వర్గము.

" Root = వర్గమూలము.

Squa ed paper = చదరపు గళ్ల కాగితము.

Square foot = చదరపుటడుగు.

Squash gourd = గుమ్మడి కాయ.

Stability = స్థాయిత్వము; స్థిరస్థితి.

Stalk = తొడిమ.

Stamens = కేసరములు; కింజల్కములు; పురుషపత్రములు.

Standard = ప్రమాణము; ప్రమాణభూత; ప్రామాణిక; అంగీకృత(మానము.)

Structure of matter = ద్రవ్యనిర్మాణము; ద్రవ్యరచన.

Strychnine = ముషిణి.

Stubble = దుబ్బు; కోయగా మిగిలిన మొదలు.

Stye = అంజననామిక; కంటి కురుపు.

Style = కీలము; పరాగవాహిని; స్త్రీకేసరనాళిక; శంఖు.

Subaltern = అధీనవాక్యము; పరస్పరాంతరలంబి (తర్క).

Subalternant = ప్రయోజకము. Subalternation = అధీనత.

Sub apical cell = ఉపాంత్యకణము.

Sub contrariety = అధీన వ్యతిరేకము.

Sub division of a fraction = ప్రభాగము.

Sub head cell = ముండల కణము.

Subject = విశేష్యము; వ్యాప్యము.

Sublimation = ఉత్పాదము; ఊర్ధ్వపాతనము.

Submerged Hyphae = అధ సంతువులు.

Sub soil = లోపలి నేలలు; అధోభూమి.

Substitute = బదులు; బదిలీ; ప్రతి; ప్రత్యామ్నాయు.

Substitution = ప్రతిక్షేపము; ఆదేశక్రియ.

Subtend = ఎదురుగానుండు; అభిముఖముగానుండు.

Subtract = తీసివేయు; వ్యవకలనముచేయు

Subtraction = తీసివేత; త్రోపుడు; వ్యవకలనము; వ్యుత్కలితము; శోధకపతనము.

Subtrahend = వ్యవకలితము; త్రోయబడు సంఖ్య.

Substratum = క్రిందిపొర; అడుగుపొర; క్రిందివరుస.

Suburbs = పరిసర ప్రదేశములు.

Succulence = రసము కలిగియుండు, రసభరిత.

Suction pump = పీల్చుపంపు; రిక్తాకాశీకరణ యంత్రము.

Sulphur = గంధకము. Sulphate = గంధకితము.

Sulphates of calcium and magnesium = ఖటిక మగ్న గంధకితములు.

Sulphate of copper = మైలుతుత్థము; తామ్రగంధకితము.

,, of zinc = తుత్తనాగము.

Sulphide = గంధకిదము.

Sulphide of copper = తామ్రగంధకిదము.

Sulphite = గంధకాయితము.

Sulphur dioxide = గంధకద్వ్యమ్ల జనిదము.

,, trioxide = గంధకత్ర్యమ్ల జనిదము.

Sulphuric acid = గంధకధృతి.

Sum = మొత్తము, యోగము.

,, of the series = సర్వధనము.

Summation = సంకలనము.

Summer Solstice = ఉత్తరాయణము.

Sun dew = సూర్యబిందు చెట్టు.

Sun flower = సూర్యకాంత; పొద్దు తిరుగుడు పువ్వు.

Sun Stroke = ఎండ దెబ్బ; వడదెబ్బ.

Superficial area = ఉపరి వైశాల్యము.

Superficies = ఉపరిక్షేత్రము; ధరాతలము; ఎత్తు లేని చదరము.

Superphosphate of bones = శల్యాధిభాస్వరితము.

Superior vena Cava = ఊర్ధ్వబృహత్సిర.

Super position = ఉపరిస్థాపనము; ఆచ్ఛాదనము.

Supplement = సమకోణద్వయ పూరక; సంపూరక కోణము (గణి).

Supposition = ఇష్టకర్మము.

Suppuration = చీము పట్టుట.

Surd = కరణి; కరణి; విమూలరాశి.

Surface = ఉపరిభాగము; తలము.

,, Developable = వర్ధనీయ తలము.

Surgical = శస్త్రసంబంధ.

Surrounding medium = ఆవరణ భూతము.

Survey = భూములకొలత; పైమాషీ.

Suspension = వ్రేలాడుట.

Suture = సీమంతిక; సీవని; సంధి; కుట్టు: చర్మముపైన కుట్టిన కుట్టు.

,, Basilar = మూలజాతుక (సీమంతిక) సీవని.

,, Continuous = అఖండ (అవిచ్ఛిన్న) సీవని.

,, Cranial = మస్తకసీవని; కర్పరసీవని.

,, Crucial = స్వస్తికసీవని.

,, Dorsal = పశ్చాత్సీవని.

,, Interrupted = విచ్ఛిన్నసీవని.

,, Lamboidal = కపాల; (అక్షరాకృతి) సీవని.

,, Metopic = గూఢసీమంతిక.

,, Parietal = పార్శ్వసీవని (పృష్ఠ).

,, Petrosequamous = శంఖచక్రాశ్మకూట సీవని.

,, Sagittal = మధ్యసీవని.

,, Twisted = వ్యావర్తిత సీవని.

,, Ventral = పురఃసీవని (పృష్ఠ).

Swamp = రొంపి; చిత్తడి నేల.

Sweat = చెమట; స్వేదము.

Sweat duct = స్వేదనాళిక; స్వేదనాళము.
Sweat glands = చెమట గ్రంథులు; స్వేదగ్రంథులు.
Sweet basil = సబ్జాగింజ.
,, Flag = వసచెట్టు.
,, Marjoram = మరువము.
,, Melon = కరిబూజ.
,, Negro Coffee = కస్తూరిసింద.
,, Orange = నారింజ.
,, Potato = చిలగడ దుంప.
Swelling = వాపు.
Swing = ఊపు.
Switch = స్విచ్చి; విద్యుత్ ప్రవాహము మరలుచు (బొత్తాము).
Syllogism = న్యాయము.
Symbol = చిహ్నము; లక్షణము.
Symbolic = లాక్షణిక; సాంకేతిక; చిహ్నసంబంధ.
Symmetry = అవయవానురూపత్వము; సౌష్ఠవము.
,, Axial = అక్షసౌష్ఠవము; కక్షసౌష్ఠవము.
,, Central = కేంద్రసౌష్ఠవము; మధ్యసౌష్ఠవము.
,, Lateral = పార్శ్వసౌష్ఠవము.
Sympathetic nerves = అనుకంపిక మజ్జాతంతువులు.
Symptomology = రోగలక్షణము.
Syncarpous = సంయుక్తదళాశయ.
Synovia = శ్లేష్మము; కీళ్లసందుల ద్రవము.
Synovitis of knee = రొప్పు; కశీర్షము; మోకాలి వాపు

Synthesis = సంశ్లేషణము; ఘటన, సమన్వయము; సంయోగీకరణము; సంపుటీకరణము; సంయోగము.

Syphilis = ఫిరంగిరోగము; కొరుకుసవాయివ్యాధి; ఉపదంశరోగము.

Syphilitic ulcers = కొరుకు సవాయి పుండ్లు; ఉపదంశము.

Syphon; Siphon = అంకుశనాళి; వక్రనాళిక.

Syringe = చిమ్మనగ్రోవి; పిచికారి.

System = సంప్రదాయము; ప్రణాళిక; మాల; రచన; వ్యూహము.

Systole = హృత్సంకోచము; గుండెకాయ ముకుళించుట.

Syzygy = గ్రహసంయోగ (పర్వ) స్థానము.

## T

Table Lands = పీఠభూములు.

Tactile Corpuscles = స్పర్శాణువులు; స్పర్శనీయకణములు.

Tangent = తాకుడుగీత; స్పర్శరేఖ.

Tangental motion = కేంద్రోత్సారము.

Tantalum = తంతలము (ర).

Tanning drum = తోళ్ళు; పదునుచేయు డోలు, తొట్టి.

Tap root = తల్లి వేరు.

Tape worm = నారికురుపు క్రిమి.

Tarnish = తగ్గుట; కాంతి విహీనమగుట.

Tarsals ; Tarsus = చీలమండ; మడిమ యెముక; పాదాస్థులు.

Tartaric acid = తింత్రిణీకామ్లము.

Tauri Beta = అగ్ని. Tauri Gamma = రోహిణి.

Tauri Pie = కృత్తిక.

Taurus = వృషభరాశి.

Teeth = పండ్లు; దంతములు.

Tegmen = మస్తిష్కతంతుత్వచము.
Tegument = అంతస్త్వక్కు; ఆవరణ; వేష్టనము.
Telegraph = తంతివార్త; టెలిగ్రాపు; తారాసందేశయంత్రము.
Telephone = తారాసంభాషణ యంత్రము; శబ్దవాహకతారాయంత్రము.
Telescope = దూరదర్శన యంత్రము; దూరదర్శని.
Teleson = తేలుకొండిభూస.
Temparature = ఉష్ణోగ్రత; శీతోష్ణపరిమాణము.
Temperate Zone = సమశీతోష్ణమండలము.
Temporals = కర్ణాస్థులు.
Temporal lobe = కర్ణవృత్తము.
Temporary = తాత్కాలిక.
Tenacity = ధారణశక్తి; జిగి.
Tend = వెళ్ళుట; ఒక దిక్కునకుపోవుట (2) కారణమగుట.
Tendency = ప్రవృత్తి; ఉన్ముఖత; జాడ; పోబడి.
Tendon = కండరబంధనము; స్నాయుబంధనము; కండరాగ్రము.
Tendril = నులి తీగెలు; లతాప్రతానములు.
Tenet = సిద్ధాంతము.
Tension = బిగువు; జిగి; పట్టు; బిట్టు.
Tentacles = (కీటకముల) మీసములు.
Terbium = టర్బియము (ర).
Term = కత్తెము; పదము; ధనము.
,, Absolute = శుద్ధ పదము.
,, Analogous = తుల్య పదము.
,, Antecedent = పూర్వ పదము.
,, Common = సాధారణ పదము (తర్క).

Term Collective Common = సమూహార్థక సాధారణ పదము.

,, Pure Common = శుద్ధసాధారణ పదము (తర్క).

Terminal = చివర; అంతిమ.

,, Bund = కొనమొగ్గ; శాఖాంతము.

,, Cell = అంతస్థకణము.

,, Growth = కొన పెంపు.

Terrestrial Equator = నాడీమండలము.

Test = శోధన; పరీక్ష.

Test tube = శోధననాళిక; పరీక్షణనాళిక.

Testa = బీజకవచము; బహిర్త్వక్కు; గింజపొర; పొట్టు.

Testimony = సాక్ష్యము; శబ్దము; ఆప్తవాక్యము.

Testis = వృషణములు.

Tetanus = ధనుర్వాయువు; ఈడుపువాయువు; ధనుస్తంభవాతము.

Tetragon = చతుష్కోణము.

Tetrahedron = చతుస్త్రికోణముఖి; నాలుగు త్రిభుజముల ఘనాకృతి.

Textiles = నేత సరకులు.

Thalamus (Torus) = ఆశయము; పాత్రదళము; ఆధారము.

Thallium = థాల్లము (ర).

Theorem = సిద్ధాంతము; న్యాయప్రశ్నము; న్యాయోక్తి.

Theory = శాస్త్రసిద్ధాంతము; సిద్ధాంతము.

Therapuetics = రోగచికిత్సాశాస్త్రము; వ్యాధిపరిహారకశాస్త్రము; ఔషధోపచార ప్రకరణము; భేషజ ప్రకరణము.

Thermometer = ఉష్ణమాపకము; ఉష్ణోగ్రతామాపకము; జ్వరమాపకము.

Thigh = తొడ; జంఘిక.

Thigh Bone = ఊర్వస్థి; జంఘాస్థి.

Thoraic Cavity = హృదయకుహరము; ఉరఃకుహరము.

,, Duct = అమరసవాహిని; క్షీరస్రోతవాహిని; ధాతూపవాహిని; ఉరోనాళిక.

Thorax = ఉరఃపంజరము; వక్షస్థలము; హృదయకుహరము; ఉరఃకుహరము

Thorium = దురము (ర).

Throat affections = గొంతు రోగములు.

Thymol = వాముపువ్వు.

Thymus gland = వక్షస్థి వెనుక హృదయమునుదగ్గర గ్రంధి.

Thyroid = డాలు ఆకారము.

,, Cartilage = కంఠకూర్చ.

,, Gland = కంఠగ్రంధి.

,, Foramen = నితంబజఘనచ్ఛిద్రము.

Tibia = జంఘిక; జంఘాస్థి; అతర్జంఘాస్థి; పిక్క లోవైపు పెద్దయెముక.

Tide = అల. High tide = పోటు. Low tide = పాటు.

Tin = తగరము; వంగము,

Tin Stone = తగరపు రాయి.

Tincture = మద్యసార పూరిత ఔషధము.

Tissue = ధాతువు; కణసంహతి; కణసమితి; కణజాలము; కలా; శరీర ఘటక ధాతువు; పేశీజాలము; పేశీసంఘాతము.

,, Adipose = మేదోమయ ధాతువు.

,, Areolar = సవివర ,,

,, Botanical = వనస్పతి ధాతువు.

,, Cancellus = సుషిరధాతువు; సుషిర సంఘాతము.

,, Cellular = త్వక్గత ధాతువు.

,, Compact = ఘనధాతువు; ఘనపేశీ సంఘాతము; ఘనసంఘాతము.

Tissue Connective = సంధాయక ధాతువు.

,, Epidermal = బాహ్యత్వచ ధాతువు; బాహ్యత్వగ్ధాతువు.

,, Epithetial = లేపక ,,

,, Elastic = స్థితిస్థాపక ,,

,, Fibrous = తంతుమయ ,,

,, Fibro Vascular = వాహినీమయ (పేశీ) ధాతువు.

,, Fundamental or Ground = సాలతత్వన్నకరణధాతువు; ఆధారధాతువు.

,, Inter lobular = పుప్పుస కణధాతువు.

,, Jelly like = శ్లేష్మ ధాతువు.

,, Lymphoid = లసికామయ ,,

,, Muscular = స్నాయుమయ ,,

,, Nervous = మజ్జామయ ,,

,, Retiform = రంధ్రపూర్ణ; (సరంధ్ర) ధాతువు;

,, Spongy = స్పంజివంటి ధాతువు.

,, Tegumentary = సంరక్షక త్వశీమయ ధాతువు.

,, Tracheal = స్రోతోత్పాదక ధాతువు.

Titana ferous Magnetite = తితనయుత అయస్కాంతాయితము.

Titana fucarms ,, = అజతలి తితనయుత అయస్కాంతాయితము.

Titanium = తితనము (ర).

Tomato = సీమవంకాయ; కర్పూర వంగ; రామ ములగ.

Tongs = పటుకారు.

Tongue = నాలుక; జిహ్వేంద్రియము.

Tonic = బలవర్ధకౌషధము; రసాయనము.

Tonsils = ఉపజిహ్వికా; గొంతులోని గవదలు.

Tonsillitis = కొండనాలుకవాపు; ఘంటాంతదాహము.
Tooth ache = పంటినొప్పి; పళ్లపోటు.
Tooth brush = పలుదోము కుంచె.
Topaz = పుష్యరాగము, గోమేధికము; పీతస్ఫటికము.
Topography = స్థలరూపవర్ణనము; నైసర్గికస్వరూపము.
Tornado = తుపాను; పశ్చిమ ఆఫ్రికాలోని తీవ్రమగు గాలివాన.
Torpedo = టార్పిడో; మత్స్యాస్త్రము.
Torrid zone = అత్యుష్ణమండలము.
Torsion = మెలిక.
Torus or Thalamus = ఆశయము; పాత్రదళము; ఆధారము.
Town planning = పురనిర్మాణ క్రమము.
Toxemia = విషజన్యరక్తదోషము.
Toxicology = విషతత్వశాస్త్రము.
Toxin = శరీరజన్య విషము.
Trace, Tracing = నకలు; మీద గీచు (2) అన్వేషణము.
Trachea (wind pipe) = ఊపిరిగాలిగొట్టము; శ్వాసనాళము.
Trail = జాడ; జాలు.
Train = రైలుబండి. Tram = ట్రాముబండి.
Transformer = పరివర్తన యంత్రము.
Transfusion = రక్తాధాన ప్రయోగము; రోగికి క్రొత్త రక్తము ఎక్కించుట.
Transit = క్రాంతి.
Translucent = అర్ధపారదర్శక; అవలివస్తువు కొంతవరకు కనబడజేయు గుణము.
Transmission = వాహనము; పంపుట.
Transmitter = ప్రేషణయంత్రము; ప్రాపణ (వాహన) యంత్రము.

Transparent = కాంతి భేద్యము; పారదర్శకము.
Transpiration = ఉపశ్వాసము; అంతపరిచాలనము.
Transposition = చోటుమార్పుట; పక్షాంతరనయనము.
Transversal = ఖండించుగీత; తిర్యగ్రేఖ; తుల్యలంబకము.
Transverse section = వ్యత్యస్త విచ్ఛేదము.
Trapezium = విషమచతుర్భుజము; అతుల్యలంబకము.
Trapezoid = సమలంబచతుర్భుజము.
Triangle = ముక్కోణము; త్రిభుజము; త్రికోణము.
,, Acute angled = లఘుకోణ త్రిభుజము.
,, Equilateral = సమభుజ త్రికోణము.
,, Isosceles = సమద్విభుజత్రికోణము.
,, Obtuse angled = అలఘుకోణ (విశాలకోణ) త్రికోణము.
,, Right angled = త్రస్రము.
,, Segment of the base of a = ఆబాధా.
,, Scalene = అసమ (విషమ) భుజ త్రికోణము.
,, Solid = ఘనత్రికోణము
Triceps muscle = త్రిశిర కండరము; త్రిశిరస్నాయువు.
Tricuspid valves = త్రిపత్రికపాటము; త్రిపిధానములు.
Tridax = కుక్కబంతి.
Trifoliate = త్రిభిన్నపత్రము; త్రిదళవంతము.
Trignometry = త్రికోణమితి.
Trinominal = త్రినామికోక్తి; త్రిపదసమాసము.
Trisection = త్రిసమఖండనము చేయుట; త్రిఖండనము చేయుట.
Tropics = ఉష్ణమండలములు; అయనవృత్తములు (ఖగోళ).
Tropic of cancer = కర్కటక రేఖ; ఉత్తరాయన రేఖ
,, ,, Capricorn = మకర రేఖ; దక్షిణాయన రేఖ.

True fruit = నిజమైనకాయ.
Truncate = క్షిప్తము; అగ్రవిహీనము; కుంఠాకారము.
Trunk = కాండము; మధ్యకాయము.
Truss = పటకా; అంత్రనిరోధక పటకా.
Truth = యథార్థము.
Tubercle bacillus = క్షయరోగసూక్ష్మదండిక.
Tuberculosis = క్షయరోగము.
Tuberose = గుల్షబు; నిశిగంధి.
Tubers = కందులు; గడ్డలు; దుంపలు; గ్రంథికోష్టము.
Tuberous = దుంపసంబంధము; గ్రంథిలము.
Tungsten = తుంగస్థము (ర)
Tumor (Tumour) = గ్రంథి; శరీరముపైనికాయ; అర్బుదము; పొత్తురుగడ్డ.
,, Fibrous = తంతుమయ అర్బుదము.
,, Fibro Nucleated = కణతంతుమయ అర్బుదము.
,, Glandular = మాంసపిండమయ అర్బుదము.
Tundras = చెమ్మనేల.
Tunnel = సొరంగము.
Turgidity = జలదార్ఢ్యము; ఉబ్బుదల.
Turmeric = పసుపు.
Turner = చుట్టుకొను లత.
Turning point = క్రాంతికాలకమర్యాద; వక్రగతిస్థానము; మళ్లుసమయము; వెనుదిరుగుస్థానము.
Turpentine = కర్పూరతైలము.
Turpeth root = తెగడ.
Twig = రెమ్మ; చిన్నకొమ్మ.

Twilight = ఉషఃకాలము; సాంధ్యారాగము.

Tympanitis, Entrio = సన్నిపాతజ్వరమున కడుపుబ్బు.

Tympanum = శ్రుతిపటలము; చెవిగూబ; కర్ణభేరి.

Typhoid bacillus = సన్నిపాతరోగ సూక్ష్మదండిక.

Typhoid fever = సన్నిపాత జ్వరము; క్షతాంత్రి విషజ్వరము.

Typhoon = టైఫూన్; తుపాను; చీనాలోని ప్రచండ పవనము.

Type = ముద్రాక్షరములు.

Type-Case = ముద్రాక్షరమంజూష.

Type, Lino = పంక్తికూర్పు అచ్చు.

,, Mono = అక్షరకూర్పు అచ్చు.

,, Stereo = స్టీరియో అచ్చుకూర్పు.

Type-writer = అక్షర విలేఖన యంత్రము.

,, Key-board = అక్షరవిలేఖన; కుంచికాఫలకము.

Type-writing = అక్షర విలేఖనము.

Typical vegetable cell = మాదిరి వృక్షకణము.

## U

Ulcer = పూయ వ్రణము; పుండు; సపూయక్షతము; కురుపు; విద్రధి.

,, Callous = ఖరవ్రణము.

,, Chronic = విలంబివ్రణము; జీర్ణవ్రణము.

,, Eozematous = పామావ్రణము.

,, Exuberant = సమృద్ధవ్రణము.

,, Fungous = అంకురితవ్రణము.

,, Gouty = వాతరక్తవ్రణము.

Healing = విరోపమాణవ్రణము; మానుడువ్రణము.

Ulcer, Idiopathic = రక్తాదిదోషవ్రణము; నిజవ్రణము.
,, Inflamed = దాహివ్రణము.
,, Inflammatory = శోథోత్పాదక (వాపు) వ్రణము.
,, Irritable = క్షుబ్ధవ్రణము, క్షోభితవ్రణము.
,, Painful = సారూజవ్రణము.
,, Perforating = వేధకవ్రణము.
,, Phagedenic = ప్రసర్పివ్రణ.
,, Rodent = ధ్వంసక వ్రణము.
,, Scorbutic = రక్తపైత్తిక వ్రణము.
,, Simple = శుద్ధవ్రణము; సామాన్య వ్రణము.
,, Sloughing = శోథోత్పాదక వ్రణము.
,, Syphilitic = ఫిరంగోపదంశజ వ్రణము.
,, Tuberculous = క్షయజ వ్రణము.
,, Varicose = సిరాజ వ్రణము; సిరావృద్ధిజ వ్రణము.
,, Verulent = పూతి వ్రణము.
,, Weak = నిశ్శక్త వ్రణము.
,, Wide spreading = వ్యాపక వ్రణము.
Ulitis = పండ్లచిగుళ్ళనొప్పి.
Ulna = కూర్పరాస్థి; అంతఃప్రకోష్ఠాస్థి.
Ultra-marine = ద్వీపాంతరఘనము.
Ultra violet ray = ఊదాకిరణము; అతినీలలోహితకిరణము.
Umbel = గుత్తి.
Umbilical = నాభియొక్క; బొడ్డుయొక్క.
Umbra = పూర్ణచ్ఛాయ; (గ్రహ) ఛాయ; నీడ.
Uncombined state = అసంయోగస్థితి.

Unconcious = అపగతచేతనము; స్మృతివిహీనత.

Unconciously = అనాలోచితముగా; అప్రయత్నముగా.

Unction = అంజనము; లేపనము.

Undistributed-middle = అవ్యాప్తహేతువు.

Umdistributed-term = అవ్యాప్తపదము.

Undulate = తరళితము.

Ungual = గోరు; (డెక్క) సంబంధమైన.

Unguent = అభ్యంజనము; అనువిలేపనము.

Unicarpellary = లఘ్వండాశయము.

Unicellular embryo = ఏకకణపిండము.

Unicellular organism = ఏకకణజీవములు.

Unicostate = ఏకకాష్ఠము;

Unilocular ovary = ఏకబిలబీజాశయము.

Union = మేళనము.

,, Granulation and Cicatrisation = అంకురోద్భవనము; 'సిధ్మ భవనము; మేళనము.

,, Immediate = తాత్కాలిక మేళనము.

,, Secondary = ద్వితీయమేళనము.

Uniplanar = ఏకతల; ఏకసమతల.

Uniform velocity = సమవేగము.

Uniformly accelerated velocity = సమవర్ధమానవేగము.

Uniformly retarded velocity = సమక్షీయమాణవేగము.

Unisexual = ఏకలింగ.

Unision = మేళనము; స్వరైక్యము.

Unit = రూపము; ఒకటి; పరిమాణము; మూలమానము; మాత్ర; ప్రమాణము; మానము.

Unit-derived = ఉత్పాదిత (మూల) మానము; ప్రమాణము.

Unit of heat = ఉష్ణరాశిమానము.

Unity = ఏకము; ఏకత్వము.

Unity, Doctrine of = అద్వైతవాదము; అభేదము.

Unity of nature = ప్రకృతియొక్క ఏకత్వము.

Universal = సర్వసామాన్య.

Universal discourse = ప్రసంగవిషయము (తర్క.).

Universal proposition = సాధారణవాక్యము.

Universal spirit = సర్వాత్మ; జగదాత్మ.

Universe = సృష్టి; విశ్వము.

Unknown Quantity = అవ్యక్తరాశి.

Unknown subject = అశ్రయాసిద్ధి (తర్క.)

Unlike term = విషమరాశి.

Unstable = తరలము; అస్థిర; చంచల.

Upper Area = ఉపరితలవైశాల్యము.

Upthrust = పైత్రోపు.

Upward pressure = ఉత్పీడనము.

Uraemia = రక్తగత మూత్రదోషము.

Uranium = వరుణము (ర).

Uranus = వరుణుడు.

Urdiea = పాలపండ్లు.

Urea = మూత్రిక.

Ureter = మూత్రనాళము.
Urethra = మూత్రమార్గము; మూత్రము బయలువెడలు ద్వారము.
Uric acid = మూత్రికరసము.
Urine = మూత్రము; ఉచ్చ.
Ursa major = బృహదృక్షము: సప్తర్షియము.
Ursa minor = లఘుఋక్షము.
Urticaria = శీతపిత్తము.
Uterus = గర్భాశయము; యోని; గర్భకోశము;
,, Inversion of = గర్భాశయము తిరుగబడుట.
Utricle = అస్ఫుటఫలజాతి.
Uvula = కొండనాలుక; కాకలకము; చిరునాలుక; ఉపజిహ్వక.
Uvulitis = ఉపజిహ్వాదాహము.

## V

Vaccination = టీకాలు వేయుట.
Vaccum = శూన్య ప్రదేశము; రిక్తావకాశము.
Vagina = భగరంధ్రము; Vaginal douche = భగరంధ్రపిచికారి.
Valency = సంయోగ సామర్థ్యము.
Valency of the elements = మూలద్రవ్యముల సంయోగ సామర్థ్యము
Valid thought = ప్రమాణసిద్ధమైన ఊహ.
Validity = సప్రమాణత; ప్రాబల్యము.
Value = మదింపు; వెల; ఫలము; విలువ; మూల్యము.
,, Absolute = స్వీయఫలము; స్వతంత్ర మూల్యము.
,, Critical = అవధి మూల్యము.
,, Intrinsic = అసలువిలువ; స్వీయమానము.
,, Limiting = సీమాఫలము; విలువహద్దు.

